# అప్పుడు

( మూడు ప్రదర్శనాలు )

[ వీటిలో రెండవ మూడవ ప్రదర్శనాలు మొట్టమొదట
"శక్తి"లో అచ్చుపడ్డాయి ]

కర్త: మోలియర్

అనువాదకర్త: భమిడిపాటి కామేశ్వరరావు

# మోలియర్



మోలియర్* ఒక ఫ్రెంచికవి; నాటకకారుడు; నటుడు. అతని పుట్టుక 1622; మరణము 1673. హాస్య రసప్రపంచంలో అతనిది పెద్దపేరు. అతడు సుమారు ముప్ఫై ప్రదర్శనాలు వ్రాశాడు. అతని కథాసందర్భం అపూర్వం; చమత్కారం అఖండం; అనుభవం అపారం; భాషాజ్ఞానం అద్వితీయం; హేళన తీవ్రం. "అప్పుడు" తన దేశంలో ఉండే సంఘంయొక్క దురాచారాలున్నూ, వ్యక్తులయొక్క అవగుణాలున్నూ, అతడు పరిహాసించి వ్రాసినా, శాశ్వతత్వం ఇచ్చే లక్షణాలు కొన్ని అతని రచనలో ఉండడం వల్లే, నేటివరకూ అతని ప్రదర్శనాలు అన్యదేశీయుల్ని కూడా ఆకర్షిస్తున్నాయి. ఈ ప్రదర్శ నాల్లో ఉన్న విశేషాలు ఆమోలియర్వి; దోషాలు అను వాదకులవి. అట్లా ఒప్పుకోవడమే అనువాదకులయొక్క ధర్మం.

సర్వస్వామ్య సంకలితం

అప్పుడు

1. తప్పనిసరి

2. వద్దంటే పెళ్లి

3. ఘటన

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి.
ఏప్రిల్—1934_8488.

# తప్పనిసరి

[ "మోలియర్" రచించిన ప్రహసనాలలో ఒక ప్రహసనానికి ఇది అనుసరణం, చాలభాగం అనువాదం. ఇది 27-8-30 తారీఖున, ఆర్ట్సు కాలేజీలో, ఒక సమావేశ సందర్భంలో మొదటిసారి ప్రదర్శించారు.]

పాత్రలు.

1. శానయ్య — వైద్యుడు
2. వసమయ్య — మధ్యవర్తి
3. జాలయ్య — గృహస్థు
4. చలమయ్య } జాలయ్య నౌకర్లు
5. చింతయ్య }
6. కాశీ — లలితకి ప్రియుడు.
7. మరకమ్మ — శానయ్య భార్య
8. లలిత — జాలయ్య కూతురు

పాత్రధారులు.

1. శానయ్య — పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు
2. వసమయ్య — మంగిపూడి మందేశ్వరరావు
3. జాలయ్య — ఆచంట వెంకటసుబ్బారాయుడు
4. చలమయ్య — దుగ్గిరాల సత్యనారాయణరావు
5. చింతయ్య — పుచ్చా పూర్ణానందం
6. కాశీ — టి. వి. చలపతిరావు
7. మరకమ్మ — మద్దూరి శ్రీరామమూర్తి.
8. లలిత — టి. వి. కృష్ణరావు

## అప్పుడు

## 1 వ రంగం

[శానయ్య మరకమ్మలు రంగముమీదికి దెబ్బలాటలో రావాలి]

శానయ్య—తెలిసిందా! మనదగ్గిర అల్లాంటివి చేపన! అనవలిసింది నేను, వినవలిసింది నువ్వు.

మరకమ్మ—ఇదిగో చెబుతున్నాను. నా యిష్టం వచ్చినట్టు నువ్వుండాలి. కోరికోరి నేను నిన్నుకట్టుకుంటూ నీరాలుగాయి చేష్టలు అనుభవించడానికి కాదు.

శానయ్య—దైవమా! పెళ్ళాం అనే పదార్థాన్ని కలిగి ఉండడంలో ఎంత బాధ పెట్టితివిరా! అందుకనే పెద్దలన్నారు—స్త్రీ అనే టటువంటి శక్తికంటె శాకినీ ఢాకినీలు నయం అని!

మరకమ్మ—పెద్దమూర్ఖులమాట పట్టుగుని ఈ చిన్నజ్ఞాని ఏం ఊరేగుతున్నారండీ!

శానయ్య—జ్ఞానిఅంటే! కాకపోవడమేం? రోజులు బాగుండక వర్తమానకాలంలో కట్టెలు కొట్టుగుంటే ఏమన్నాను! ఈ ప్రస్తుతం కట్టెలు కొట్టేవాళ్ళల్లో, ఈ భూప్రపంచంలో నాతో సరిసమానంగా దేన్నిగురించి అయినా సరే వాదించగల చవటనిగాని, నాకుమల్లే ఒక

గొప్పగాయకుడి దగ్గిర ఆరేళ్ళపాటు కృషిచేసిన సన్యాసిని గాని, మాటలు ఇంకా రాకుండానే సంస్కృతం చూ వత్తూ అప్పగించగల దద్దమ్మనిగాని, సాధించు! సవాల్! మీసం మీద చెయ్యి!

మరకమ్మ—ఇదేం ఘోరణమ్మా! ఏదేనా జాడ్య మేమో!

శానయ్య—ఓసి నీకు జాడ్యం రానూ! మరకమ్మ పని పహిలాపచ్చీస్‌గా ఉందే!

మరకమ్మ—'సరే' అని నే నీ పెళ్ళికి ఒప్పుకున్నది, ఎంతపాపిష్టి గడియోకద!

శానయ్య—ఇల్లా నా నాశనానికోసం నా చేత ఒప్పించిన ముసిలివాడు ఎంతపాపిష్టి కుంకోగద!

మరకమ్మ—మనపెళ్ళి గురించి నువ్విల్లా ఎందు కేడుస్తావు? నేను పెళ్ళాంగా దొరికినందుకు నువ్వు ఆ పరమేశ్వరుడికి అనవరతం మొక్కుతూండొద్దూ! నా వంటి పెళ్ళానికి భర్తగా ఉండేటందుకు నీకు అర్హత ఎక్కడేనా ఉండేడిసిందీ అసలు? ఆలోచించి చూసుకో!

శానయ్య—అవును, మరే, నువ్వన్నట్టు! నువ్వు నాకు ఎక్కడలేని గౌరవం తెప్పించావు! పెళ్ళినాడే నాకు కడుపు నిండిపోయింది. అయ్యో? బతుకు! నన్నాకట్టే కడపకు, ఈ మాటా ఆ మాటా రేగచ్చు! మరి...

మరకమ్మ—మరి! ఏమిటి నువ్వనబోయేది?

శానయ్య—చాల్లేస్తూ! ఆగు. నాకు తెలిసిం దేదో నాకు తెలుసు. వెనక నువ్ చేసిన పూజాఫలమే నేను నీకు పట్టుపడడం.

మరకమ్మ—నువ్వు నాకు దొరకడం నా అదృష్టం పండడం వల్లా? నీ పిండం! చిప్పా దొప్పా చేతికి తెచ్చావ్, పోకిరివి, దగాకోరువి, లుచ్చాఫివి, నా ఆస్తి యావత్తూ తినేశావ్!

శానయ్య—శుద్ధ అబద్ధం, శుద్ధ అబద్ధం. నీ ఆస్తి తిన్నేదు. ఇది తేశాను (బొటనవేలు నోటికేసి చూపిస్తాడు.)

మరకమ్మ—ఇంతింత చొప్పునే అమ్మకానికి పెట్టి ఇల్లంతా ఒకడకి తెచ్చావ్!

శానయ్య—దానినే ఉన్నదాల్లో సద్దుకోడం అంటారు.

మరకమ్మ—చెప్పుకుంటే సిగ్గు, (హావ్వ) పడుకునే మంచం కుక్కి కూడా అమ్మేశావ్!

శానయ్య—పోనీ, నువ్వు పెంకరాళ్ళే లేవచ్చు!

మరకమ్మ—చివరికి కొంపలో పూచిక పుడకం తేనా లేకుండాచేసి,...

శానయ్య—పోనీ, ఎక్కడికేనా వెళ్ళడానికీ దానికీ, తేలిగ్గా ఉంటుంది!

మరకమ్మ—అహోరాత్రాలు తెగతాగుడు, ఏక జూదం!

శానయ్య—విచారం అనేది మనస్సుకి తెలియకుండాను!

మరకమ్మ—ఇంట్లో ఎటుచూసినా పిల్లలుగదా, ఏమిటిదరి! వీళ్ళని ఏం జెయ్యాను?

శానయ్య—ఆలోచ నెందుకు, ఏదో ఓటి చెయ్!

మరకమ్మ—నా క్కూతురికి నలుగురు పిల్లలున్నారు!

శానయ్య—దింపి నేలమీద నుంచో పెట్టు, పోనీ!

మరకమ్మ—అస్తమానం వాళ్ళు అన్నంకోసం రాగాలే!

శానయ్య—అన్నం అడిగినప్పుడల్లా అట్టుతిరగేస్తూండు. అదిగో పొన్నకర్ర. ముందు నేను పూర్తిగా తినేసి తాగేసిన తరవాత, మిగిలిందాల్లో మీగడున్నా సరే, అంతా జుట్టువలిసిందే, నే వస్తన్నానా?

మరకమ్మ—కాలం ఎప్పుడూ ఓమోస్తరుగానే ఉండదోయ్, తాగుబోతు సన్యాసి!

శానయ్య—ఒసేవ్, పెళ్ళాం, నువ్వు కొంచెం జోరుతగ్గాలి; తగ్గించు.

మరకమ్మ—నీదు శ్లేష్మలూ దార్జన్యాలూ నేను పడాలనా, నీ మాట !

శానయ్య—కోపం ఆత్మేముదరనీయకు, ప్రేయసీ!

మరకమ్మ—నీ ధర్మం నువ్వు ఆచరించడం లేదు. నీకు స్మారకం లేదు. నిన్ను స్పృహలోకి దింపడం నాకు తెలియదనే నీఊహ?

శానయ్య—ప్రియభార్యా! నాకూ కోపం అనేది ఉండకపోదు, దాన్ని తగలెయ్యా! పై పెచ్చు, జబ్బ మెలిరిగి ఉంది.

మరకమ్మ—ఈ బెదిరింపులు ఎరుగుదుం!

శానయ్య—ఓసి చిట్టీపొట్టీ! చిలకలకొలికీ! నీ వీపు చిటచిటలాడు తోందా ?

మరకమ్మ—నువ్వంటే నాకు చీమంతైనా భయంలేదు. కనబడుతుందిగా !

శానయ్య—హాప్రియురాలా, అర్ధాంగీ! దెబ్బలు నా సొమ్ము. అల్లాంటి నా దెబ్బల సొమ్మైతిని నాకు ఋణపడి ఉండాలనా నీ తొందర !

మరకమ్మ—ఈ మాటలకి నేను జడుస్తాననా ?

శానయ్య—నా కోర్కల పంటా! నీ కణత మీాద ఒక్కటి ప్రసాదించడానికి అనుజ్ఞ ?

మరకమ్మ—తాగుబోతా !

శానయ్య—తంతాను !

మరకమ్మ—సారాపీపా !

శానయ్య—చావగొడతాను !

మరకమ్మ—దరిద్రగొట్టా !

శానయ్య—చితక్కొట్టేను గనక !

మరకమ్మ—సామిద్రోహీ, డాబుల్రావ్, దగాకోర్, పిరికిపందా ! అభాండ్రా! ఫాజీ ! టోపీదాస్ !

శానయ్య—అయితే నీకు కావాలి (కర్రతో పెళ్ళాన్ని బాత్తాడు.)

మరకమ్మ—(గోల పెడుతూ) అయ్యో! అయ్యో!

శానయ్య—నాలిక కట్టడానికి గత్యంతరం లేక పోతే చావనామరి ?

(చెయ్యిచాచి, ఆగమని సంజ్ఞచేస్తూ వనమయ్యవస్తాడు.)

వనమయ్య—ఆ గాలి ! తగ్గాలి ! ఉండాలి ! మనిషివా దున్నపోతువా ? ఎవడు చెప్పాడయ్యా నీకు ? ఎవడేనా నవ్విపోయేదు గనక. సెబాసు ! ఛీ ! ఛీ ! ఇల్లానుటయ్యా పెళ్లాన్ని చావగొట్టడం !

మరకమ్మ—(నడుముమీద చేతులుపెట్టుగుని, నిదానించి, పక్కచూపులుచూసి, వనమయ్యని వెనక్కి

తరిమి, కవ్వించి, చివరికి అత్తెస్తే ఒక్క చెంపకాయ వేసి)

ఒక వేళ నన్ను కొట్టుగిలు ములుకు, ఆయన్ని నేనే ప్రార్థించిఉంటే అప్పుడు? అప్పుడేమంటావ్, వనమయ్యా!

వనమయ్య—(తెలితెప్పరిస్తూ) ఓహో! అల్లా అయితే మా ఇదే, ముమ్మాటికి మంచిది!

మరకమ్మ—ఒక్కటే నీ గోలి ఏముంది?

వనమయ్య—లేదిదీ, బుద్ధొక్కవ నాదే.

మరకమ్మ—హెచ్చరిగ్గా రాజమ్మలాగ, వేరు చెయ్యొచ్చాడు, మొగుళ్ళు పెళ్ళాలని ఇష్టం వచ్చినట్టు చావగొట్టుకోకుండా!

వనమయ్య—నేను నిష్క్రమిస్తానులే, అమ్మా!

మరకమ్మ—నీ సమాధానం ఏమిటో చెబుదూ?

వనమయ్య—సమాధాన ఏముంది ఇహ, నా శ్రాద్ధం.

మరకమ్మ—పానకంలో పుడకలా అడ్డొచ్చావు గాని, నీకు హక్కేమిటిలా రావడానికి?

వనమయ్య—ఏమీ లేదు.

మరకమ్మ—ఈ పాటికి నీ పని నువ్వుచూసుకో.

వనమయ్య—ఇంకేముంది మాట్లాడానికి.

మరకమ్మ—నేను దెబ్బలు తింటాను. నాయిష్టం.
(అని మీదిమీదికి నడుస్తుంది)

వనమయ్య—నిక్షేపంలా ఉండగన్నా తిను.

మరకమ్మ—అల్లాంటప్పుడు నీకేం నెప్పి?

వనమయ్య—నిజమే నమ్మా.

మరకమ్మ—అనవసరపు సందర్భాల్లో ఎప్పుడూ ఇల్లావచ్చి పడకు యెద్దుమొగ్గ స్వరూపం!

(అని మళ్లీ శ కోపంగా నడమీద తగిలిస్తుంది. అతడు శానయ్యదగ్గరికి వెడతాడు)

వనమయ్య—ఏమండోయ్ !

శానయ్య—ఛీ అవతలికి పో.

వనమయ్య—మరేం !

శానయ్య—ఓరే ! పోరా

వనమయ్య—ఒక్క మాట

శానయ్య—ఒక్క దెబ్బ ( అని విసిగెత్తి చివరకి వనమయ్యని కర్రతో ఒక్కటేస్తాడు. )

వనమయ్య—(దణ్ణంపెడుతూ) బాబూ! మన స్సాక్షిగా కోరుతున్నాను, నాఅపరాధం క్షమించు. కానీ, నీభార్యని ఇంకా చావగొట్టి చెవులుముయ్, కావలిస్తే నేనుకూడా ఓభుజం వేస్తాను.

శానయ్య—అక్కర్లేదు.

వనమయ్య—(దీర్ఘంగా) అబ్బా! అది మళ్ళీవల్ల కాదేం!

శానయ్య—నాయిష్టం వస్తేనే కొడతాను. నా యిష్టంకానప్పుడు నేనుకొట్టను.

వనమయ్య—బాగుంది, నాయనా, బాగుంది.

శానయ్య—అది నాపెళ్ళాం. అవునా? లేక పోతే, నీపెళ్ళామా?

వనమయ్య—అబ్బే! ఛ ఛ! నిస్సందేహంగా! ఇదోటా?

శానయ్య—నన్ను ఆంక్షపెట్టడానికి నువ్వెవడవ్?

వనమయ్య—ఆలాగేమరీ!

శానయ్య—నీసాయం నాకొద్దు.

వనమయ్య—మాభాగే, అల్లానేకానీ.

శానయ్య—ఇంకోళ్ళ వ్యాపారంలో ఎప్పుడూ ఇల్లా లుదుంగున జొరబడకు.

వనమయ్య—చిత్తం.

శానయ్య—ఈపాటి దయచెయ్‌మరి.

(అని కర్రతో వేస్తాడు. తిరిగి పెళ్ళాందగ్గిరికివచ్చి చెయ్యి పట్టుకోబోతాడు.) ఇకచాలుగాని, సంధిచేసుగుందాం.

ఒసే! ఓముద్దిల్లా పారెగ్! స్సెయ్! ఆటాపీటా చిల్లంగోర్ !

మరకమ్మ—నిజమేపాపం. సంధి చేసుగోవలి సిందే, చావగొడుతున్నారుగనక !

శానయ్య—దానికేమిటి పోదూ! ఏవీ, చేతులు!

మరకమ్మ—నేను ఇవ్వను.

శానయ్య—ఇవ్వవ్ ?

మరకమ్మ—ఇవ్వను.

శానయ్య—నా చక్కెరబొమ్మా !

మరకమ్మ—అయినాసరే, ఇవ్వను.

శానయ్య—అబ్బ ! రమ్మంటేనూ !

మరకమ్మ—ఒక్కనాటికి ఇవ్వను.

శానయ్య—ఇయ్యి. ఒకటోసార్, రెండోసార్, ...ఏం? మూడోసార్......దోబుచ్చి! ( అని కళ్లు చేత్తో మూసుగుంటాడు. )

మరకమ్మ—నేనివ్వను. నాకు కోపంగా ఉండా లనుంది.

శానయ్య—అబ్బ, రద్దూ! ఆటలో అరిటిపండు. రా! రావే!

మరకమ్మ—పోదూ !

శానయ్య—చేతులు ఇమ్మంటూంటే !

మరకమ్మ—నన్ను పెట్టేసయ్యాకనక !

శానయ్య—సరేనే. అంతమట్టుగువస్తే, కోరుతున్నాను. క్షమించు, చెయ్యి ఏదీ !

మరకమ్మ—సరే. క్షమించాను. ( తనలో ) ఇంతకి ఇంతా ముట్టచెప్పితీరాలి.

శానయ్య—ఇది ఓలెక్కేటే వెఱ్ఱిదాన ! ఇవి స్వల్పాలు. అడపాతడపా కర్రదెబ్బలు పడుతూంటేనే గాని, జనానికి అన్యోన్యప్రేమ అతిశయించదు. మరి వెడతా ! ఈవేళ అడివియ్యావత్తూ మనింటోనే ఉంటుంది. ( ఎడమకి వెడతాడు. )

మరకమ్మ—( ఎడమవేపుకే తిరిగిఉండి వెనక్కి నడుస్తుంది. కుడివేపుకి ముఖంపెట్టి వెనక్కినడుస్తూ చలమయ్య, చింతయ్యలు ఉంటారు. మరకమ్మ వారినితాకి )

మరకమ్మ—క్షమించాలి. ఏదో పరధ్యానంగా ఉన్నాను. ఓ విషయంగురించి తలకాయ బద్దలుకొట్టుగుంటున్నాను.

చలమయ్య—మాగొడవ మాది. మేమూ ఓ విషయంగురించి బుర్రకాయ బద్దలుచేసుగుంటున్నాం. అది సరె సైతే, ఎంతేనాఉంది బహుమతీ !

మరకమ్మ—నాకేమన్నా తెలుస్తుందేమో చెబుతారా?

చలమయ్య—చెప్పకేం, వినండి. మీకు తెలియచ్చుకూడాను. మాకు, మాంచి తెలివిగల డాక్టరు కావలిసొచ్చాడు. మా యజమాని కూతురికి నోరుపడి పోయింది. వైద్యాలంతా చూడ్డం, మందులన్నీ పొయ్యడం, సూదులెట్టి కుట్టడం అన్నీ అయాయి. జిహ్వా రాలేదు. పెద్దవైద్యాలన్నీ బబ్బున్నాయి గనక ఏదేనా గోసాయి చిట్కావల్ల కుదురుతుందేమో అని చూస్తున్నాం.

మరకమ్మ—(తనలో) మా ఆయనికి బాకీ తీర్చడానికి మంచిఎత్తు దొరికింది. (పైకి) సరిగ్గా అడగవలిసిన మనిషినే అడిగారు. ఈప్రాంతాన్నే ఒకఅద్భుత ప్రజ్ఞగల డాక్టరు ఉన్నారు. వారు ఏకేసేనాసరే పడతారు.

చలమయ్య—ఎక్కడున్నారో చెప్పి పుణ్యం కట్టుకుందూ!

మరకమ్మ—ఈపక్క అడివిలో వారిప్పుడు విలాసార్థం లీలగా పుడకలు కొడుతూంటారు.

చలమయ్య—ఆయన చెట్లకికూడా వైద్యం చేస్తాడుగావున్నా చింతయ్యా!

చింతయ్య—మరేగావుర్నా, చలమయ్యా! (మరకమ్మతో) అల్లా కొట్టడం ఏమన్నా వనమూలికలకోసమా ఏమిటమ్మా ?

మరకమ్మ—అయన చాలా అద్భుతుడు. ఆయన చర్యలసాధారణం, చిత్రం, వికృతంగాకూడా ఉంటాయి. అతను అనకతవకగా వేషంవేస్తాడు, అజ్ఞానం నటిస్తాడు. అనగా జ్ఞానంలేనట్టు ఉంటాడు, భగవంతుడిచ్చిన వైద్య ప్రజ్ఞ ఎక్కడో పాతరవేసేసి వచ్చినట్టు కనిపించడం అతనికిసరదా.

చలమయ్య—గొప్ప వాళ్ళందరికీ ఇదే రోగం ఒక్కొక్కడికి ఒక్కొక్క వెఱ్ఱి. పాండిత్యం గట్టిపడడానికి వేపకాయంత వెఱ్ఱికూడా టంకంపడ్డట్టు పడాలి కాబోలు !

మరకమ్మ—ఈయన వెఱ్ఱిఉందే, అది మీరనుకునేదానికంటె పెద్దసైజు. ఒక్కొక్కప్పుడు మొత్తగా తన్నితేనేగాని తనవైద్యప్రజ్ఞ తనే ఒప్పుగోడు. అతడు మరీ వెఱ్ఱికళగాఉంటే, మీరిద్దరూకూడా చెరోపొన్నుకర్రాపుచ్చుకుని వారిని సున్నంలోకి ఎమికలేకుండా బాజాపడితేగాని, ఆయనమనస్సులో ఉన్నది కక్కడు. ఆయనతో మాకు ఏమన్నాపనుంటే, మేం అంతే చేస్తూంటాం !

చింతయ్య—ఇదేంసరదా, ఎక్కడో చవటరకం లాడున్నాడే ?

మరకమ్మ—ఏమో ! ఉన్నసంగతదీ. ఆసరదా తీరింతరవాత, వైద్యంలో మరి పిడుగు !

చలమయ్య—అతని పేరు ?

మరకమ్మ—శానయ్య! నల్లటి చొక్కా, తెల్లటి పాగా ఉంటాయి.

చింతయ్య—మెట్టుకి గట్టివాడేనా ?

మరకమ్మ—మామూలు వైద్యాలంతా పెదిమి విరిచి వెళ్లింతరవాత, ఒకావిణ్ణి శ్మశానానికి తీసికెళ్లే దారిలో, ఈయన ఎదురుపడి, ఏదో అరుకు, ఒక్కబొట్టు పెదిమిమీద వేసేసరికి, ఆవిడ లేచి గంతులెయ్యడంకూడా మొదలెట్టింది.

చలమయ్య—ఓరివీడి మొహంఈడ్చా! గట్టివాడే!

మరకమ్మ—ఓ పన్నెండేళ్ల అబ్బాయి గోపరం మీాంచి కిందపడి కాళ్లూ, చేతులూ, నడుమూ, వేళ్లూ విరుచుగుని ముక్కలయిపోయిన దరిమిలాని ఇతడు వెళ్లి ఏదో తైలం మర్గించుదాం అని సీసా తీస్తూండగానే, ఆ అబ్బాయి అతుక్కుని మన్మథుడులా అయిపోయి, ఆడి పోయాడు.

చలమయ్య—ఓరి వీణ్ణి తగలెయ్యా!

చింతయ్య—వీరు అల్లా అయితే సకల ప్రపంచ రోగనివారకులా?

మరకమ్మ—నిస్సంశయం.

చింతయ్య—ఆయనే కావాలి మాకు.

మరకమ్మ—అతని వెఱ్ఱికళ రైటుచెయ్యడానికి నేను మీతో చెప్పింది మరవకండి, వెళ్లండి.

చలమయ్య—సరేలే. బడితెప్రయోగం తప్ప రెండోది అక్కర్లేనప్పుడు మాదే రాజ్యం. సెలవ్ మరి!

[మరకమ్మ కుడివేపుకి నిష్క్రమిస్తుంది. చలమయ్య, చింతయ్యలు ఎడమవేపుకి నిష్క్రమించాలి] (తెర)

## 2వ రంగం

(ఎడమనుంచి శాంనయ్య న,న,న,న అంటూ రాగం తీస్తూ వచ్చి, గొడ్డలి కింద పడేసి, నుదురుమీద చెమట తుడుచుగుని, కూర్చుని జేబులోంచి సీసా తియ్యబోతాడు. ఎడమనుంచి వచ్చి, చలమయ్య, చింతయ్యలు కుడివేపుకి నడిచి, పొంచి చూస్తారు.)

శాంనయ్య—ఈ శ్రమకి ఓచుక్క పడితే గాని కిట్టదు (అని నవ్వుమొహంతో, తల పంకిస్తూ, సీసాని ముద్దులు పెట్టుగుంటూ ఉంటాడు. "భడవా, వెధవ

వేషా లేస్తావ్, నాదగ్గిరా!" అంటూ సీసాని నవ్వుతూ కోప్పడతాడు.)

చలమయ్య—వీడే!

చింతయ్య—మొకటే వీడు తగిలాడు మనకి! నయమే!

చలమయ్య—ఇంకా దగ్గిరికి వెడదాం.

చింతయ్య—అదుగో సల్లచొక్కా, తెల్లపాగా! మూడుమూర్తులా వీడే.

(చింతయ్య వెళ్లి సాష్టాంగపడతాడు. వాడు సీసా తస్కరిస్తాడేమో అని శానయ్య తన సీసా అవతలవేపున దాచుకుంటాడు. ఆవేపుకొచ్చి చలమయ్య సాష్టాంగ పడతాడు. శానయ్య సీసా కోటులో దాచుకుంటాడు.)

చలమయ్య—మీపేరు శానయ్యగారు కాదండీ?

శానయ్య—ఏమంటావ్ (అని లేస్తాడు.)

చలమయ్య—మీపేరు శానయ్యగారేనా అని.

శానయ్య—(వాళ్ల ముఖాలు పరకాయించి) అవనూ అవును, కానూ కాదు. అతనితో మీకేం పనో దాన్ని బట్టి ఉంటుంది.

చలమయ్య—అతనికి మేం గొప్ప ఉపకారం చెయ్యాలి.

శానయ్య—అల్లా అయితే, నేనే శానయ్యని.

చలమయ్య—మిమ్మల్ని కలుసుగోడంవల్ల నేడు సుదినం. మాకు కొంచెం సాయం కావలిసి వచ్చాం. మీదగ్గిరికి వస్తే పని జరుగుతుందని విన్నాం.

శానయ్య—ప్రస్తుతం నాది కట్టెలవ్యాపారం! స్వల్పం! కట్టెలతో సంబంధించింది ఏదేనా అయితే చూస్తాను.

చలమయ్య—తమరు కూర్చోండి.

చింతయ్య—సావకాశంగా దయచెయ్యండి.

శానయ్య—ఏమివీళ్ల మర్యాద! (కూర్చుంటాడు.)

చలమయ్య—మేం మీదగ్గిరికి రావడంలో ఆశ్చర్యం లేదు. జ్ఞానం దగ్గిరికి ప్రపంచం పరుగెడుతుంది. మీ అఖండప్రజ్ఞ గురించి మాకు తెలిసింది.

శానయ్య—ఏదేనా సరే, పేళ్లు వెయ్యడంలో నాఅంత ముండావాడు లేడండి, దాపరికం ఎందుకు!

చలమయ్య—ఆమాట కాదండి, బాబూ.

శానయ్య—నేను ఒళ్లు దాచుకోను, నేను చేసిన పని అందరికీ నచ్చుతుంది.

చలమయ్య—మేం అందుకుగాదు వస్తా (అని చింతయ్యకేసి చూస్తాడు.)

శానయ్య—పైగా నేను పట్టు రూపాయి కిస్తాను.

చలమయ్య—ఇక ఆమాట అనకండి.

శానయ్య—నిజమేనండీ, నేను అంతకి తక్కువ అమ్మను.

చలమయ్య—మాకూ పరిస్థితులు తెలుసు.

శానయ్య—మీకు పరిస్థితులు తెలిస్తే మాత్రం! నేను అమ్మే ధర అంతే.

చలమయ్య—బాబుగారు పరిహాసాలు ఆడుతున్నారు.

శానయ్య—పరిహాసాలా? నేను దమ్మిడీ తగ్గితే అమ్మనే అమ్మను.

చలమయ్య—విషయం తప్పించి మాట్లాడదాం.

శానయ్య—కావలిస్తే మరోచోట కొనుక్కోండి. ఎక్కడ చూసినా కర్రలేగా, ఇప్పుడు!

చలమయ్య—మహాప్రభూ! ఆ ప్రసంగం చాలు.

శానయ్య—ఆఖరికి కోళీ తక్కువయినా సరే, నా కట్టెలు నేను ఛస్తే అమ్మను (అని కోప్పడతాడు.)

చలమయ్య—ఏడిశారుగాని చెబుదురూ!

శానయ్య—అంతా ఇచ్చి తీరాలండీ. నాదేమీ దోపిడీరకం కాదు.

చలమయ్య—ఎందుకయ్యా, అపకతవక నేషం? మీవంటివారు, ఎంత ప్రజ్ఞ, ఎంత నైద్యం, ఎంత పని! అంతా మూల పడేస్తున్నారు.

శానయ్య—(తనలో) వీడికి మతిలేదు.

చలమయ్య—మాదగ్గిర దాచకండి.

శానయ్య—ఏమిట్రా అదీ!

చింతయ్య—ఈ బుకాయింపు ఇక్కడ సాగదు. మాకు తెలిసింది సంగతి.

శానయ్య—నే నెవ రనుకుంటున్నార్రా, పిచ్చి వాళ్లలారా!

చలమయ్య—తమరు గొప్ప వైద్యశిఖామణులు!

శానయ్య—ఛీ, పొండి. నేను వెనకా వైద్యుణ్ణి కాను, ఇప్పుడూ కాదు.

చలమయ్య—(పక్కవాడితో) అదిగోరోయ్ వీడి పైత్యకళ! (పైకి) సత్యం కప్పెట్టకండిబాబూ గ్రంథం చాలామట్టుకి వెడుతుంది.

శానయ్య—చాలామట్టుకి అంటే?

చలమయ్య—మాకే విచారంవేసేపన్లు మేంచేసిం దాకా.

శానయ్య—మీపన్లు మీరు చెయ్యండి. ఒట్టు. నేను వైద్యుణ్ణికాను. నాకు వైద్యంఅంటే తెలియదు.

చలమయ్య—(పక్క వాడితో)పిడికి ఓ మోతాదు ఇవ్వాలి. (పైకి) ఆఖరుసారి అడుగుతున్నాం. ఉన్న సంగతి అనెయ్యండి.

శానయ్య—అయ్యలారా, వెయ్యేల? నేను వైద్యుణ్ణి కాను.

చలమయ్య—కావూ?

శానయ్య—కాను.

చింతయ్య—వైద్యుడి వేకావూ?

శానయ్య—కానయ్యా, మహాప్రభూ!

చలమయ్య—సరే, నీ రాతం తే.

(వాళ్లిద్దరూ కర్రలుచ్చుగుని అతణ్ణి బజాయిస్తారు.)

శానయ్య—అల్లాఅయితే సరేరా, మీ మొహాలు మండా, ఆగండిరా! వైద్యుణ్ణే!

చలమయ్య—మాచేత ఎందు కింత దౌర్జన్యం చేయించడం?

శానయ్య—అయితేనూ, మీరిద్దరూకూడా వెట్టి పీనుగులులా ఉన్నారేం? నేను వైద్యుణ్ణి అంటారేం.

చింతయ్య—మళ్లీ మొదటికొచ్చావు? వైద్యుడివి కావు?

శానయ్య—వైద్యుణ్ణేమిటి మీపిండాకుడు!

(వాళ్లు మళ్లీ బొత్తారు.)

ఆగండి, బాబులారా ఆగండి. మీకోరిక ప్రకారం, నేను వైద్యుణ్ణి, అస్త్రవైద్యుణ్ణి, శస్త్రవైద్యుణ్ణి, ఇంకా కావలిస్తే భూతవైద్యుణ్ణి. మీచిత్తం! బుర్ర చితకపొడుస్తూంటే ఎందుకేనా ఒప్పుకోవాలి.

చలమయ్య—తమరిప్పుడు ప్రజల్లో పడ్డందుకు ఆనంద మవుతోంది.

శానయ్య—మీరు నన్ను క్షమించాలి.

చింతయ్య—మిమ్మల్ని మేం చావగొట్టినందుకు ఏమీ అనుకోకండి.

శానయ్య—సరేగాని, నేను వైద్యుణ్ణే? సందేహం లేదంటారా?

చింతయ్య—నిజమేనండి.

శానయ్య—నిజంగా?

చలమయ్య—ముమ్మాటికీ.

శానయ్య—నాకే తెలియదే?

చలమయ్య—మీఅంత వైద్యుడు భూమిమీద లేడు. ఆకాశంలో మనుష్యులే లేరు.

శానయ్య—ఆహాహా!

చింతయ్య—తమరు చెప్పన్ని రోగాలూ కుదిర్చారు!

శానయ్య—(నవ్వుతూ) ఓరి నాయిల్లు బంగారం గానూ!

చలమయ్య—ఈమధ్య ఒక ఆవిడ చచ్చిపోయిన ఆరుగంటలకి శ్మశానానికి తీసికెడుతూంటే ఆవిడ పెదిమి మీద ఒక్క చుక్క వేసి లేవదీశారు.

శానయ్య—(ముక్కుమీద వేలుతో) ఓరి నే చచ్చిపోనూ!

చింతయ్య—పన్నెండేళ్ల పిల్లవాడు గోపరం మీంచి పడి ఒళ్లంతా పొడుం పొడుంకాగా, తైలం రాచి వాడి శరీరం అతికేశారు.

శానయ్య—ఓరి నన్నా పాతెయ్యా!

చలమయ్య—ఇకమాతోరండి. మీరు మొయ్య లేనంత ధనం మీకొస్తుంది.

శానయ్య—నాకు కావలసినంతానా?

చలమయ్య—ఓ.

శానయ్య—అల్లా అయితే నేను గొప్పవైద్యుణ్ణే! (కొంచెం నిదానించి, చూపుడువేలు ఝాడించి టప్పు మనిపించి) ఇకంతా లోగడ మరిచాను. ఇప్పుడిప్పుడు స్ఫురణకి వస్తోంది. ఏంజెయ్యాలి ఇప్పుడు? ఎక్కడకు వెళ్లాలి?

చలమయ్య—మాతో వస్తే సరి, మేమే లాక్కెడ తాం. ఓ అమ్మాయికి మాటపోయింది. ఆవిణ్ణిచూడాలి.

శానయ్య—నాకర్మం కాలా, నాకాగోడవ తెలియదే?

చలమయ్య—(పక్కవాడితో) వీడికి కాస్త చమత్కరిస్తూండడం ఇష్టం (పైకి) రండిస్వామీ!

శానయ్య—వైద్యుడిమిస్తాబు లేందే?

చలమయ్య—మేం ఇస్తాం నడవండి!

(అంతా కుడివేపుకి నిష్క్రమిస్తారు. శానయ్య దగ్గాగా, పెద్ద పెద్ద అంగలతో, చేతులు ఊగిస్తూ, నిదానంగా ముందు నడుస్తాడు)

## 3 వ రంగం

(జాలయ్య ఇల్లు. జాలయ్య ఇటూ అటూ తిరుగుతూ ఉంటాడు. కుడివేపునించి చలమయ్య చింతయ్యలు ధూకుడుగా వస్తారు).

చలమయ్య—అయ్యా, సిద్ధంగా ఉండండి, డాక్టరు గారు వస్తున్నారు. భూమిమీద అంత గొప్పవాడు లేడు.

చింతయ్య—కడం డాక్టర్లు ఇక బల్లలు తీసెయ్యాలండి. ఇతడు చచ్చినవాళ్లనే లేవదీస్తాడు.

చలమయ్య—మరేనండి, కానైతే, ఇతెగానికి కొద్దిగా పైత్యకళమాత్రం కద్దు.

చింతయ్య—అదో టీనూ, పైగా, ఆయన అప్పుడప్పుడు చిన్న చిన్న చమత్కారాలు చూపిస్తారు. అవి చూపించినప్పుడు ఆయన తలకాయలో ఏదో సీలకాస్త వదులైందా అనిపిస్తుంది.

చలమయ్య—అవి పైమాటలుగాని, పునాది కట్టుదిట్టం ఆయునికి విశేషంగా ఉండండి. అరుగో, వచ్చారు.

(శానయ్య కుడివేపునుంచి రీవిగా వస్తాడు.)

చలమయ్య—రండి, ఇదే జాలయ్యగారి గృహం. వీరిదే. వీరమ్మాయికే సుస్తీ!

జాలయ్య—రండి, రండి, చాలా ఇబ్బందిలో ఉన్నాం.

శానయ్య—మాకు తెలుసును. తమరు లోగడ అనేక వైద్యాలు చేసినట్టుకూడా నాకు...

జాలయ్య—చిత్తం. తమరు నాతో నేనా మాట్లాడుతూంటూ?

శానయ్య—అవును.

జాలయ్య—నేను వైద్యుణ్ణికాను.

శానయ్య—మీరు వైద్యులుకారూ?

జాలయ్య—ఒట్టండీ, కాను.

శానయ్య—నిజంగా?

జాలయ్య—నిజంగానే.

[శానయ్య, కర్రపుచ్చుకుని జాలయ్యను చావగొడతాడు]

జాలయ్య—నీ మొహం తగలెయ్యా! ఇల్లా కొడతాడేం?

శానయ్య—ఇప్పుడు వైద్యుడివేనా? ఒప్పుకో వయ్యా, స్వామీ! నాకుమాత్రం అంతకంటె ఎక్కువ పట్టా ఏమి ఏడిసింది?

జాలయ్య—(చలమయ్యతో) ఎక్కడో కజ్జాకోరు ఘటాన్ని కొట్టుగొచ్చారేమిరా?

చలమయ్య—వారికి కొద్దిగా పైత్యకళ ఉన్న సంగతి తమతో ఇప్పుడే మనవిచేశాను.

జాలయ్య—నాకు తిక్కేను గొచ్చిందంటే వరిగెట్టాలి, వీడూ వీడిపైత్యమూను.

చింతయ్య—ఫర్వాలేదండి. వారు ఈ రీతిగానే చమత్కరిస్తూంటారు.

జాలయ్య—ఇదా చమత్కారం? వీడి మొహంలా ఉంది.

శానయ్య—అయ్యా నేను తమ యెడల మరీ చనువు చూపినందుకు క్షమాపణ వేడుకుంటున్నాను.

జాలయ్య—చిత్తం తమ విధేయుణ్ణి.

శానయ్య—నాకు చాలా విచారం వేస్తోంది...

జాలయ్య—ఫర్వాలేదు లెండి.

శానయ్య—ఎందుకంటే! తమర్ని చావగొట్టిన గౌరవం నాకు వచ్చినందుకు.

జాలయ్య—ప్రాణాపాయం లేదు. దాని కేంగాని, మా అమ్మాయికి సుస్తీగా ఉంది.

శానయ్య—మీ అమ్మాయికి సుస్తీగా ఉన్నందుకు నే నెంతో ఆనందిస్తున్నాను, ఏమంటే ఆమెను నేను సేవించడానికి వీలుదొరికింది గదా అని. ఆరీతిగానే మీ ఇంటిల్లపాతికీ కూడా చాలా సుస్తీగాఉండి ఉంటే నేను మరీసేవచెయ్యవచ్చుగదా అని మరీఆనందించేవాణ్ణి.

జాలయ్య—ఇంత గౌరవానికి నేను అనర్హుణ్ణి.

శానయ్య—అయితే మీ అమ్మాయి పేరు?

జాలయ్య—లలిత.

శానయ్య—పిలవండి.

(జాలయ్య ఎడమవేపుకి వెళ్లివస్తాడు. వచ్చి సంజ్ఞ చేస్తాడు. వెనకాలే లలిత వస్తుంది.)

శానయ్య—ఈవిడ కేనా, మూగ?

జాలయ్య—మరేనండి. పిల్లగనకపోతే, నేను ఎందులోనేనా పడాలి. ఏక పుత్రిక.

శానయ్య—అబ్బే, పో తేఎల్లా? పోవడానికి ఏవీలేదీ? వైద్యుడొచ్చి మందిస్తాండే పోకూడదే మరీ!

జాలయ్య—కుర్చీలు తెండిరా, చూస్తారేం? తెచ్చివేసి వెళ్లండి.

(మూడు కుర్చీలువేసి వాళ్లు వెడతారు.)

శానయ్య—(జాలయ్యకీ లలితకీ మధ్య కూర్చుని) రోగి డోకు రావడంలేదు. మొగాడు శుచిగా ఉంటే ఈ అమ్మాయితో కాలక్షేపం బాగానే చెయ్యొచ్చు మరి!

లలిత—(నవ్వుతుంది)

శానయ్య—నేను నిమ్మళంగా మాట్లాడినా విన బడుతోందే! మూగాళ్లకి వినికిడి ఉండదని పాతవైద్యు లంటారు. మధ్యవచ్చిన మూగలో చెముడు ఉండదని మా మతం.

జాలయ్య—ఏమైతేం; మొట్టుకిపిల్ల దానికినవ్వు తెప్పిం చారు.

శానయ్య—మంచిదండీ. వైద్యుడు రోగిని నవ్వించడంకంటే శుభచిహ్నం లేదు. (లలితతో) సంగతేమిటమ్మా? అసలేమిటీ? నీకుకలిగే బాధయొక్క స్వభావం ఏమిటీ?

లలిత—(నోటికేసీ, గడ్డంకిందా, వేలితో చూపిస్తూ దవడ ఆడిస్తూ) హా, హీ, హూ, హాయ, యః

శానయ్య—ఏమిటి నువ్వనేదీ ?

లలిత—హా, హీం, హూం, హాంయ, యః

శానయ్య—అంటే ?

లలిత—హా, హీం, య, యః

శానయ్య—(ఆవిణ్ణి అనుకరిస్తూ) "హా, హీం, యః యః" అనా ? పైశాచిక భాష వొచ్చినముండా వాణ్ణి నాకే తెలియడం లేదు, ఏమిటమ్మా ఈభాషా ?

జాలయ్య—ఇదేనండి దీనికొచ్చిన రోగం. ఇది అమాంతంగా మూగదై ఊరుకుంది. కారణం తెలియ కొచ్చింది. అంచేత చెయ్యదల్చుకున్న పెళ్లికూడా ఆగి పోయింది.

శానయ్య—ఎంచేత ?

జాలయ్య—ఏం చెప్పనూ? కర్మసూత్రం. ఇది ఓణ్ణి కావాలంది. వాడికి సెంటు భూమిలేదు, దమ్మిడీనిలవ లేదు, చిన్నంపాత్తు మెకడులేదు. అది మానేశాను. మానేసి ఇంకో గొప్పది వరహాలుగాడి సంబంధం రైటు చేశాను. ఆపీనుగు ఈమూగది నాకొద్దని కూర్చున్నాదు.

శానయ్య—ఆశుంఠ ఎవడు, పెళ్లాం మూగదా కూడదని కోరుకునేవాడు ! మాఆవిడికి ఈరోగంవస్తే బతికిపోదును. అదేగనక జరిగితే యుగంతిరిగినా మాఆవిడికి మందెయ్యకపోయిఉందును.

జాలయ్య—మీరు ఇది ఎల్లానేనా కుదర్చాలి.

శానయ్య—(చప్పరించి, చిటికివేసి) అదుర్దాపడకండి. అయితే ఈఅమ్మాయికి చాలా ఇదిగా ఉంటుందా ఏమిటి ఈరోగంవల్ల ?

జాలయ్య—మరేనండి.

శానయ్య—ఉండాలి,ఉంటే మరీమంచిదీ. ఈపిల్ల విస్తారం నెప్పులు పడుతూంటుందా ?

జాలయ్య—విస్తారమేనండి.

శానయ్య—అదీ మంచిలక్షణమే (లలితకేసితిరిగి) ఏదమ్మా చెయ్యి ! (చెయ్యిచూసి కనుబొమ్మలు ఎగరేసి, తలపంకించి, మూలిగి) అల్లాచెప్పూ ! ఇదిగో నాడిలో స్పష్టంగాఉంది, ఈపిల్లమూగదీ ! మూగనాడి ఠక్, ఠక్ మని కొడుతూంటేనే !

జాలయ్య—మరేనండి. అదేనండి దీనిబాధ. మీరు చూస్తూనే కనిపెట్టారు.

శానయ్య—ఏమనుకుంటున్నారు మన తడాఖా! మావంటి గొప్పవైద్యులం చూస్తూనే పోలుస్తాం. మరో చవటడాక్టరైతే లేనిపోని రోగాలపేర్లు లక్షచెప్పి, అవన్నీవచ్చి వంట్లో చిక్కడ్డాయంటారు. మేం ఆదినించీ ఘంటాపథంగా అనేదేమిటంటే, ఈపిల్ల మూగది !

జాలయ్య—ఆమాటనిజమేగాని, అయ్యా నాకు తెలియకడుగుతున్నాను ! మూగతనం ఎంచేత వస్తుం దంటారు !

శానయ్య—అబ్బె, అందులో ఏముందీ! మాటలు పోవడం వల్లే !

జాలయ్య—అంతే అంటారా ! అయితే ఈమా టలు పోతూండడానికి కారణం ఏమిటంటారు ?

శానయ్య—ఈవిషయంలో మా వైద్యగ్రంథ కర్తల అభిప్రాయం ఏమిటంటే, నాలికయొక్క చలనానికి ఏదో అడ్డు కలగడంవల్లనే అని.

జాలయ్య—నాలికయొక్క చలనానికి అడ్డు ఎందు వల్ల కలిగుతుందీ ?

శానయ్య—కాళిదాసు ఏమన్నాడంటే దీన్ని గురించీ! (ఆగి సకిలించి) అద్భుతంగా బోలెడన్నాడు.

జాలయ్య—కావును.

శానయ్య—అబ్బో ! వాడెక్కడండీ ! జగత్తుకి సరిపడ్డ బుర్ర.

జాలయ్య—నిశ్చయంగా.

శానయ్య—ఇంతాఅంతా కాదు. అఖండుడు. సరేమన విషయంలోకి వత్తాం. నాలికయొక్క చలనానికి

ఎందుకు అడ్డుతగులుతుంది అంటే, సకలరోగకారణ ప్రదేశ...అల్లా చూస్తారేం? మీకు సంస్కృతం వచ్చునా?

జాలయ్య—ఒక్క ముక్క రాదండి.

శానయ్య—(అమాంతంగా లేచి) సంస్కృతమే రాదూ?

జాలయ్య—రాదు నాయనా.

శానయ్య—(కుదుటపడి) సకలరోగ కారణ ప్రదేశజనిత......కారణం జాగ్రత్తగా వినండి.

జాలయ్య—చిత్తం.

శానయ్య—వాయు— "వాయు" అంటే మా వైద్యంలో తెలుసునా? "దుర్గంధ భూయిష్ఠవాయు" అన్నమాట. సకల......దుర్గంధ భూయిష్ఠవాయు నిశ్వాసతుందిల విషరసంబులచే......

జాలయ్య—సంస్కృతం రాకపోవడం ఎంత ప్రాబల్యం అండీ!

శానయ్య—సదరు వాయువులు ఎడమవైపున నున్న పైత్యకోశము మీదుగా, కుడివేపున ఉండే గుండెకాయను దాటిపోవును. ఆరసంబులచే ఏర్పడు ఒకానొక తెగులుచే!!! నాలుకయొక్క చలనము అడ్డును.!!! ఇదీ కారణం! తెలిసిందా?

జాలయ్య—ఇంతకంటె ఎవరు చెప్పగల్రుకాని, గుండెకాయ కుడివేపనీ, ప్రెత్యకోశం ఎడమ అని తమరు సెలవిచ్చినచోట బోధపడలేదు. మీరు ఓచోటది ఓ చోటకి పిరాయిుంచారు.

శానయ్య—మీరుచెప్పేది పూర్వవైద్యం. మాది పరవైద్యం. మేం అంతా మార్చేశాం. కావలిస్తే దాఖలా చూపిస్తాం.

జాలయ్య—నేను ఎరగనండి, క్షమించాలి.

శానయ్య—పోనీ అల్లానే క్షమించాను. ఈ సంగతులు మాకు మల్లే ఎల్లా తెలుస్తాయి పాపం మీకు!

జాలయ్య—అయితే దీనికి ఏంచెయ్యాలి?

శానయ్య—మందుమాటా?

జాలయ్య—మరే.

శానయ్య—నా అభిప్రాయం ఏమిటంటే వెళ్లి ముసుగుపెట్టుకుని పడుకోవాలమనండి. ఇక పథ్యం—రొట్టి బ్రాందీలో నానేసి ఇవ్వండి.

జాలయ్య—అదెందుకూ?

శానయ్య—ఎందుకంటే, వాటి సమ్మేళనంలో వాక్కు జారీఅయే లక్షణంఉంది.

జాలయ్య—నిజమేనండోయ్! ఎవర్రా! చలమయ్యా! రొట్టి నానెయ్యించు.

శానయ్య—చిత్తం. సాయంత్రం మళ్ళీవచ్చి చూస్తానండి.

జాలయ్య—ఒస్తున్నా. ఒక్క క్షణం ఉండండి.

(అని పిల్లకి సంజ్ఞచేసి లోపలికి తీసికెళ్ళి వస్తాడు.)

శానయ్య—ఇక నాకు సెలవండి.

జాలయ్య—ఉండండి మరీ.

శానయ్య—ఎందు కండోయ్?

జాలయ్య—ఏదో ఒక్క తృణం ఫీజు.

శానయ్య—(చెయిపడుతూనే) పుచ్చుకోడం నాకు ఎల్లానో ఉంటుంది.

జాలయ్య—అహఁ

శానయ్య—వద్దండి!

జాలయ్య—ఉఁహుఁ, చెప్తూంటేనూ!

శానయ్య—ఛఛా!

జాలయ్య—బతిమాల్తూంటే, ఏమిటండీ!

శానయ్య—ఊరికే అంటున్నారు.

జాలయ్య—ఇదిగోనండీ: ఊరికే ఏమిటీ?

శానయ్య—ఏమోనండీ.

జాలయ్య—అహఁ

శానయ్య—నాకు డబ్బు కాపీర్ణం లేదండి.

జాలయ్య—నాకు తెలియదూ! పడుదురూ!

శానయ్య—(పుచ్చుకుని) ఇందులో దొంగ నోట్లూ ఏవీ లేకుండా అన్నీ మారేవేనా, వెనక వేపున సంతకం చేసి ఇవ్వండి.

జాలయ్య—ఎంతమాటా! (అని ఎడమ వేపుకి వెళ్లిపోతాడు)

శానయ్య—ఇందులో బాగానే కిట్టేటట్టుంది. అయితే ఒకటీ, ఒక వేళ గనక నుసం...ఏది...

(కుడి వేపునించి కాశీ వస్తాడు)

కాశీ—అయ్యా, తమ దర్శనం కోసం నిరీక్షిస్తున్నాను. తమరునాకు కొంతసాయం కటాక్షించాలి.

శానయ్య—(దగ్గిరికి రమ్మని సంజ్ఞచేసి నాడి చూచి) నీ నాడి బొత్తిగా పాడుగాఉంది.

కాశీ—నా కేమీ సుస్తీగా లేదే? అందుకు కాదు నే వచ్చింది.

శానయ్య—నీకు సుస్తీగా లేకపోతే, ఆమాట నాతో ముందే చెప్పి తగులడకపోయావ్, దెయ్యంలాగ?

కాశీ—మీతోడండి. సుస్తీలేదు. ఇంకోపనిమీద వచ్చాను. నాపేరు కాశీ అంటారు. ఇప్పుడు మీరు చూసొచ్చిన లలితమీద నాకు మోహం. ముసిలాడికి గుండె

ల్లేవండి. నేను వాళ్ళమ్మాయిని చూడకుండా కట్టుదిట్టం చేశాడు. ఓపన్నాగంలో కనక మీరు నాకు ఆసరా యిస్తే, నాకు సౌఖ్యం ఒళ్లో పడుతుంది.

శానయ్య—(కోపం నటిస్తూ) నీ మోహావ్యవహారాల్లో దింపి నా డాక్టరుహోదా తగలేసుగోనా? ఛీ!

కాశీ—బాబూ,గోల చెయ్యకండి. (అని దిక్కులు చూస్తాడు.)

శానయ్య—నేను గోల చేస్తానయ్యా! ఏం జేస్తావ్, అతిగడుసువేషాలూ నువ్వూనూ!

కాశీ—కొంచెం శాంతించండీ!

శానయ్య—బుద్ధిలేకుండా బయలుదేరి...

కాశీ—నీకు దణ్ణమయ్యా!

శానయ్య—ఆడిన ఆటల్లా వీడిదగ్గిర సాగుతుం దనుకున్నావు గాని మహా!

కాశీ—(డబ్బుసంచీ తీస్తాడు) అయ్యా!

శానయ్య—యథాశక్తి నీకు సాయంచెయ్యమనా నువ్వనేది? అల్లా బోధపడేటట్టు చెప్పరాదూ? (డబ్బు పుచ్చుగుని) నీమాట కాదు నేనంటూ, నీకేం నిక్షేప రాయిడివి. నీకు చేసిన సాయమే సాయంకాని, ఈప్రపంచంలో జనంమీద వట్టిపుణ్యానికి అపోహాలుపడే డబక్కు

రాయిళ్లు చాలా ఉన్నారు. నే ఇందాకణ్ణించీ కోప్పడ్డది వాళ్లని కాని నిన్ను కాదు.

కాశీ—నే నింత చోరవమీాద దగ్గిర చూపించి నందుకు క్షమించాలి.

శానయ్య—దానికేం గాని ఏమిటి సంగతి ?

కాశీ—ఏమీా లేదు. ఆపిల్ల ఉందే లలిత! ఆఅమ్మా యికి మూాగా లేదు, వల్లకాడూ లేదు. తనకు నచ్చని పెళ్లి చేస్తారేమో అని గమ్మత్తు చేస్తోంది. మనం ఇద్దరం ఓచోటుంటే ఎవరేనా చూసి అనుమానపడతారు. వెడుతూ చెబుతాను రండి, మీారు నాకు చెయ్యవలిసిన ఉపకారం.

శానయ్య—అల్లానే, నీ మోహచక్రంలోకి నన్ను లాగేశావు. నావైద్యం ఈమాటు పూర్తిగా ప్రయోగిస్తాను. ఆ అమ్మాయి నీకు అయిపోవాలి. లేకపోతే ఆ అమ్మాయి పనేనా అయిపోవాలి. నడుమరి.

(ఇద్దరూ కుడివేపుకి వెడతారు.)

4 వ రం గం

(ఎడమవేపునుంచి జాలయ్య వస్తాడు.)

జాలయ్య—ఆ వైద్యుడు పీనుగు తుపాకికి అందకుండా పోయాడు. రోగం చూడ్డొస్తే ముదిరింది. నువ్వ

నడుస్తానంటావ్. నిమ్మళంగా రా! నడవేలేవే అంటే వినవాయిరి!

(అని వెనక్కి తిరుగుతాడు. లలిత వచ్చి ఒక అంగవేసి కింద పడిపోతుంది. సభవారికేసి తలకాయ పడేటట్టు పడాలి.)

జాలయ్య—నే చెప్పలా? వద్దంటే శాస్త్ర నాగన్యత ఉంచాలా? ఇప్పుడు ఏగోతులో దిగను?

[కుడివేపునించి శానయ్య, కాశీ (కంపౌండరు వేషంలో) వస్తారు.]

జాలయ్య—మీకోసమే నేను ఇదవుతూంటా!

శానయ్య—నేను తోటలో ఆడుకుంటున్నాను లెండి...అమ్మాయి ఎల్లా ఉన్నట్టు?

జాలయ్య—మీ మందుతో అసలు చెడి మరీ పాడుగా ఉంది.

శానయ్య—ఇంకేం! బాగుపడబోయేటప్పుడు స్థితి అల్లానే ఉంటుంది.

జాలయ్య—కాని ఈలోపల అంతా చల్లారేటట్టుంది.

శానయ్య—ఫర్వాలేదు. నాదగ్గిర సర్వాన్నీ జయించే కుప్పెలున్నాయి. ఈ అమ్మాయి మృత్యు

ముఖాన్ని ఎప్పుడు పడుతుందా, నేను నా అపూర్వౌష ధాలు ఎప్పుడు వాడదామా అని చూస్తున్నాను.

జాలయ్య—(కాశీకేసి చూసి) ఈయన కేంపని?

శానయ్య—వీరు మాదగ్గిర కంపౌండరు.

జాలయ్య—ఏమిటీ?

శానయ్య—మాదగ్గిరా...

జాలయ్య—ఊఁ

శానయ్య—మందులు తయారుచేసి యిచ్చే కంపౌండరు!

జాలయ్య—అదా. కంపౌండరా?

శానయ్య—మరే, మీ అమ్మాయిని గురించే తరిఫీదు చేశాను.

సరే గాని, కంపౌండరుగారు, మీరు వెళ్లి ఆ అమ్మాయి నాడి చూడండి. స్థితిగతులు గురించి నేను తరవాత మిమ్మల్ని అడిగినప్పుడు చెబుదురుగాని!

(కాశీ లలిత దగ్గిరికి వెడతాడు. పక్కని మోకరిస్తాడు. శానయ్య జాలయ్యని కుడిపక్కకి తీసికెళ్లి, ఆపక్కకే అతనిచేత మొహం పెట్టించి, తను ఎడమకి తిరిగి ఉంటాడు. జాలయ్య వెనక్కి తిరిగి చూడడానికి యత్నించినప్పుడు, చెయ్యి అడ్డెట్టి, అతడు మెడ తిప్పడానికి వీలులేకుండా చేస్తాడు. ఈరీతిగా మాట్లాడుతాడు)

శా—అయ్యా, వైద్యప్రపంచంలో "మొగాళ్లకి రోగం కుదర్చడంకంటె ఆడాళ్లకి రోగం కుదర్చడం తేలి కేనా ?" అనే ప్రశ్న చిరకాలంనించి ఉంది. ఈవిషయం జాగ్రత్తగా వినండి, కొందరు అవునన్నారు, కొందరు కాదన్నారు. నేను మాత్రం అవునూ, కాదూ రెండూ కాడా అన్నాను.

జాలయ్య—అంటే

శానయ్య—స్త్రీలయొక్క సహజతత్వంలో ఉండే తామసరసగుణ వైషమ్యంవల్ల వారి భౌతికప్రేమ ఆత్మ శక్తిని జయిస్తుంది. అంచేత అభిప్రాయాల్లో భేదాలు...

లలిత—(కాశీతో) నా మనస్సు నేను ఎన్నటికీ మార్చుకోను.

జాలయ్య—మా అమ్మాయి మాట్లాడుతోంది ! ఓరి దీని తస్సలమందూ! మందెంతగొప్పదో! బలేవైద్యుడి వయ్యా ! ఈ అద్భుతవైద్యం మీరు చేసినందుకు మీకు ఎంత ఋణపడ్డానండీ, ఎల్లా నేను ఋణవిముక్తుణ్ణి అవడం?

శానయ్య—(టోపీ తీసి విసురుగుంటూ, ఇటూ అటూ పచారుచేస్తూ) అబ్బా, నిజంగా, ఈరోగం గురించి మాచెడ్డతిప్పలు పడ్డానండీ !

లలిత—అవును నాన్నా, మాట వచ్చింది. అందుకనే చెబుతున్నాను. నాకు కాశీ తప్ప మరోడు వద్దు. ఆ వరహాలుగాడు అసలు వద్దూ!

జాలయ్య—మరీ?

లలిత—నేను నిశ్చయించుగుంటే అంతే. తిరుగులేదు.

జాలయ్య—ఏమిటీ!

లలిత—గొప్ప సవబులు నువ్వు లక్ష చెప్పు. అవన్నీ వ్యర్థం.

జాలయ్య—ఒక వేళ?

లలిత—నాకు నచ్చనివాణ్ణి నేను కట్టుకోవాలని తండ్రి చెబితే మాత్రం! ఆమాట తో సెయ్యవలిసిందె! నీ ప్రయత్నం కల్లవార్తే. నిర్బంధానికి నా మనస్సు లొంగదు.

జాలయ్య—వాడూ!

లలిత—లేకపోతే సన్యసిస్తాను.

జాలయ్య—అయితే?

లలిత—(పెద్ద కేకలేస్తూ) అయితేలేదు, గియితే లేదు, లాభంలేదు. వాక్కు. దండగ. నాయిష్టం. అంతే.

జాలయ్య—ఆఁ, ఆఁ, ఏమిటా వాగ్ధోరణి! కొట్టుకుపోయేట్టున్నాం మే మంతా! (శానయ్యతో) మహానుభావా, దీన్ని మళ్లీ వెనకటి మూగదాన్ని చేసేద్దురూ!

శానయ్య—అది నాతరంగాదు. కాని మీమాట కొట్టెయ్యకూడదు గనక, మీకు చెముడు రావడానికి మంచిమందు ఇవ్వగలను.

జాలయ్య—సంతోషించాం. (లలితతో) నీకు తెలుసునా, సాయంత్రమే నిన్ను.

లలిత—ఊఁ, నీమాటలవల్ల నేను తిరగను!

జాలయ్య—ఈసాయంత్రమే, నిన్ను వరహాలు కిచ్చి మంచెట్టేది (వెళ్లబోతాడు)

లలిత—ఆ. అంతకంటే మృత్యువుని పెళ్లాడతా.

శానయ్య—ఆగండి. వెళ్లిపోకండి. ఈవ్యాపారంలో కూడా మాకు తరుణం ఇవ్వాలి. ఈరోగమూ నాకు తెలుసు, అందుకు మందూ ఉంది.

జాలయ్య—అయితే మీరు మానసికరోగాలు కూడా లాగేస్తారా ఏమిటి?

శానయ్య—ఒక దెబ్బని. అన్నింటికీ ఉన్నాయి నాదగ్గిర మందులు. ఈ రోగానికి మందెయ్యడం మరెవరూకాదు మా కంపౌండరే.

(కాశీతో) మాటయ్యా! ఈ అమ్మాయికి కాశీ మీాద ప్రేమ. తండ్రిగారికి ఆ సంగతి పడదు. రసాలు ఇక తీవ్రం అవుతాయి. కాలయాపన పనికిరాదు. నాకు ఒకటే మందు తోస్తోంది. ఒక అవున్సు పలాయన ద్రావకం మోంతాదులో, కాస్తంత కళ్యాణమాత్ర కూడా మిళావు చెయ్యి. ఆమోతాదు పుచ్చుకోడానికి ఆ అమ్మాయి పేచీ పెడుతుంది. ఈ విషయంలో ప్రవీణుడివేగా! అందుచేత ఆ అమ్మాయిచేత ఎల్లానో ఒప్పించి పని జరిగేటట్లు చేసుకునే పూచీ నీది. వెళ్లు.

(ఎడమ వేపుకి కాశీ వెడతాడు. వెనకాలే లలిత వెళ్లిపోతుంది)

జాలయ్య—మీారేదో మందులు చెప్పారు, ఏంమందు లవి? నేను పుట్టిన తరువాత అవి విన్నేలేదే?

శానయ్య—అవి మరీ అర్జెంటు వ్యాపారాల్లో వాడే బాపతు లెండి.

జాలయ్య—ఇందాకట్నించీ, చూశారుగా మా అమ్మాయి పెంకితనం?

శానయ్య—ఆడపిల్లలు అప్పుడప్పుడు మా చెడ్డ పెంకిగానే ఉంటారు.

జాలయ్య—అది ఆ కాశీ అంటే ఎంత ఇదవుతుందో మీాకేం తెలుసు!

శానయ్య—యువకుల రక్తంలో ఉండే ఉత్సాహంవల్ల అల్లాంటివి పుడతాయిలెండి!

జాలయ్య—ఈ ఉద్రేకం నేను పసికట్టడంతోటే, పిల్లని ఓ గదిలో పెట్టి తాళంవేశాను

శానయ్య—మీరు తెలివిగలవారగనక!

జాలయ్య—మరి వాళ్లకి ఉత్తరప్రత్యుత్తరాలు జరక్కుండా బందుచేశాను.

శానయ్య—అల్లానే చెయ్యాలి.

జాలయ్య—ఒర్నీ ఓరు చూసుకోనిస్తే ప్రమాదం జరిగిపోయేదేనా?

శానయ్య—సందేహం ఏమిటి?

జాలయ్య—మీరెరగరు గానీ, అది వాడితో లేచిపోవడానికి కూడా తగిందిమాత్రం అవును.

శానయ్య—మీరు బహుసూక్ష్మబుద్ధితో వర్తించారు.

జాలయ్య—దాంతో ఎల్లానే నా మాట్లాడాలని వాడి ఏడుపుట. అదీ నాకు తెలిసింది.

శానయ్య—అల్లాగా? అసాధ్యుడే నండోయ్! పీడోవ్?

జాలయ్య—కాని వాడు నెగ్గుతాడనే?

శానయ్య—వెఱ్ఱిమాట! మిమ్మల్నే! (చింతయ్య ఎడమవేపునుంచి పరుగుపరుగున వస్తాడు).

చింతయ్య—బాబూ, కొంప తవ్వింది. లలితమ్మ గారు ఆకాశీగారితో లేచిపోయారుట. ఆ వచ్చిన కం పౌండరేట కాశీగారు! ఈ శస్త్రవైద్యుడుగారే ఈ చికిత్స యావత్తూ చేశారు ఇక్కడ జేరి.

జాలయ్య—హరి! వీడే! ఇల్లా దగా చేస్తావుట్రా, నీవైద్యం తగలెయ్యా! పిలు! పిలు! పోలీసువార్ని పిలు. ఓరిలుచ్చా! నీకు ఖైదే యిస్తానంతు!

చింతయ్య—ఏ మయ్యోయ్! కదిత్తే బాగా జరగదు నీకూ నాకూ, జాగ్రత్త.

శానయ్య—ఎం జేస్తావ్?

జాలయ్య—నోర్మయ్! పోలీసుకోర్టుకి నెట్టిస్తాను. డొక్క చీరి ఎండేయిస్తాను. కొవ్వుతీయిస్తాను.

శానయ్య—తీసిగెళ్లడం ఎందుకూ! పోనీ మీరే చావగొట్టండయ్యా.

(కుడివేపునించి కాశీవస్తాడు, వెనక లలిత వస్తుంది.)

కాశీ—అయ్యా, నేను కాశీని. ఇదిగో మీ లలిత. మేం లేచిపోయి పెళ్లిచేసుగోవాలనుకున్నాం. కాని, లేచిపోవలసిన అవసరం లేకుండా మరో ఘరానా మార్గమే దొరికింది. మీ అమ్మాయిని మీరే నాకు ఇవ్వండి. సంగతి ఏమిటంటే, మా పిం తండ్రి పోయా

డుట, వారిఆస్తి యావత్తూ నాకు కలిసింది. ఇదిగో ఉత్తరం.

జాలయ్య—అల్లా చెప్పూ! నేను మొదట్నించీ అప్పుడప్పుడు నిన్ను గురించికూడా ఆలోచిస్తూనే ఉండే వాణ్ణిష్మీ! చెప్పద్దూ! సరే, లలితని ఇప్పుడు నీకివ్వడం తప్పనిసరి! డాక్టరుగారూ, ఆట్టే ఇక బెదరకండి!

శానయ్య—చిత్రం. మీకూతురు పెళ్ళి మీ ఇష్ట ప్రకారం కుదరబట్టి నాకు దెబ్బలపెళ్ళి తప్పింది. చింతా కంత దూసుకుపోయింది గాని నావైద్యానికి బలేమందు పడేది.

(చింతయ్యతో) అయితే సరేగాని, నేను వైద్యుణ్ణని ఎవరయ్యా మీతో చెబుతా?

చింతయ్య—ఒక ఆడమనిషి. తరవాత, మా చలమయ్య వెళ్ళి కనుక్కుంటే తెలిసింది, నీ భార్యట!

శానయ్య—నిజమే? (అని వెళ్ళబోతాడు)

జాలయ్య—సరేలే! పెళ్ళిభోజనం కానిచ్చుగుని మరీ వెడుదుగాని!

శానయ్య—తప్పనిసరిగా! కాని, ఇంట్లో కాలెట్టగానే మా ఆవిడికి దెబ్బలు తప్పనిసరి!...(తెర)...

# వద్దంటే పెళ్లి

["మోలియర్" చేత రచింపబడినటువంటి ఒక ప్రహసనానికి ఇది యనుసరణం, చాలామట్టుకు అనువాదం. ఈ ప్రహసనం, 23–8–31 తారీఖున, ఆర్ట్సుకాలేజిలో, బ్రహ్మశ్రీ పింగళి లక్ష్మీకాంతంగారి అధ్యక్షతక్రింద జరిగిన సమావేశ సందర్భంలో మొదటసారి ప్రదర్శింపబడింది.]

పాత్రలు.

1. శానయ్య—ధనికుడైన ముసలిపెళ్లికొడుకు
2. సరయ్య—శానయ్యకి స్నేహితుడు
3. శిఖామణి—వేదాంతి
4. శాంత—పెళ్లికూతురు
5. చంద్రుడు—శాంతకి ప్రియుడు
6. రాజాలు—శాంత తండ్రి

పాత్రధారులు.

1. శానయ్య—దుగ్గిరాల సత్యనారాయణరావు
2. సరయ్య—పుచ్చా పూర్ణానందం
3. శిఖామణి—సోమంచి యగ్గన్నశాస్త్రి
4. శాంత—ఐ. భావనాచార్యులు
5. చంద్రుడు—టి. వి. చలపతిరావు
6. రాజాలు—ఉలిమిరి సోమేశ్వరరావు

## 1 వరంగం

[శానయ్య ఇంట్లో వీధిహాలు. కొన్ని కుర్చీలు ఉం టాయి. శానయ్య కుర్చీమీంచి లేచి, కుడివేపుకి తిరిగి]

శానయ్య—తలుపేసుగోండి, ఇక్కడున్నట్టు వస్తాను. ఇల్లువదిలం. ఇంతలో అపసవ్యాలు ఏమీ జరగ నియ్యవద్దు. డబ్బు కిచాటు రోజులు. నాదగ్గిర బాకీ వసూలుచేసుగోడానికని చెబుతూ కొందరు నాకోసం రావచ్చు. వాళ్ళతోటి, నేను ఊళ్ళోలేననీ, ఎక్కడి కెళ్ళానో ఎప్పుడొస్తానో తెలియదనీ, చెప్పండి. మరికొం దరు సొమ్ము పట్టుగుని నాబాకీలు వసూళ్ళు ఇవ్వడాని కొస్తారు. వాళ్ళతోటిమాత్రం నేను సరయ్య ఇంట్లో ఉంటానని చెప్పండి. (అని, కుడివేపుకి నిష్క్రమించ బోయేసరికి, సరయ్య వస్తాడు.)

సరయ్య—డబ్బు విషయం తెలివితేటలంటే, ఇదిగో, ఇలాఉండాలి!

శానయ్య—(నిదానించి) ఒహోహో! సరయ్యే నాపమిటీ! ఇంకేం! చిక్కేలేదూ? నేనూ మీయింటికి రావాలనే?

సరయ్య—ఏం ఏం?

శానయ్య—నా బుర్రలో గొప్పసంగతి ఒకటి ప్రవేశించింది. దాన్ని గురించి నీ సలహా పుచ్చుకోవాలని.

సరయ్య—అందుకు అభ్యంతరం ఏమిటి? పరమ సంతోషం. రొండోవాడి ప్రమేయంలేకుండా కావలిసినంత మాట్టాడుకోవచ్చు.

శానయ్య—కూచోమరి, ప్రస్తుతసంగతి చాలా ముఖ్యమైన సంగతి. ఏవిషయంలోనైనా నాసరే, స్నేహితుల ఆలోచన పుచ్చుకోకుండా ఏమీ చెయ్యకూడదు.

సరయ్య—నీ ఆంతర్య స్నేహితుల్లో ఒకణ్ణిగా నన్ను కట్టినందుకు విధేయుణ్ణి. సంగతిఏమిటో చెవిని వెయ్యి!

శానయ్య—నేను ఏం చెబుతున్నా బాగుందని నన్ను నువ్వు పొగడకూడదు. నీమనస్సులో ఉన్న మాట నువ్వు తెగేసి చెప్పాలి—అందుకు నేను నచ్చుగోనీ నొచ్చుగోనీ, వేరుమాట!

సరయ్య—అల్లానే!

శానయ్య—మనస్సులోమాట పైకి చెప్పని స్నేహితుడుకంటె పాతకుడు మరి ఉండడు.

సరయ్య—నిజం.

శానయ్య—ఆంతరంగిక స్నేహితులు ఈ కాలంలో అరుదు.

సరయ్యా—నిశ్చయం. (అని తొందరపడతాడు)

శానయ్యా—అందుకని, నువ్వు నీహృదయంపైకి చెప్తావ్ అన్నమాట! ఖరార్!

సరయ్యా—ఖరార్!

శానయ్యా—ఒట్టు!

సరయ్యా—మన స్నేహం మీద ఒట్టు. విషయం చెప్పుబాబూ, చంపేసేస్తున్నావ్.

శానయ్యా—అల్లాయితే, విను. నేను పెళ్లిచేసుకుంటే బాగుంటుందా, బాగుండదా?

సరయ్యా—ఎవరు? నువ్వా!

శానయ్యా—అవునూ! నేనే! (చూపెట్టుగుంటూ) అనగా స్వంతం! ఈ విషయంలో నీ సలహా ఏమిటి?

సరయ్యా—మొదట ఓసంగతి అడుగుతానుచెప్పు.

శానయ్యా—ఏమిటది?

సరయ్యా—నీ కెన్నేళ్లుంటాయని నీ ఊహ!

శానయ్యా—నాకా! (అని ఆలోచిస్తాడు.)

సరయ్యా—అవును.

శానయ్యా—నాకు తెలియదోయ్! కాని, నాశరీరం కేవలం గడియారం లాంటిది. ఎన్నడూ ఇల్లా చిరుననీదను.

నరయ్య—అది సరిలే! కొంచెం హెచ్చుతగ్గులో నీ వయస్సు నీకు తెలియదూ?

శానయ్య—తెలియదు. మనికెన్నేళ్లని మనం ఆలోచిస్తూ కూచుంటామా?

నరయ్య—సరే. అల్లాయితే, మానాన్నకీ, నీకూ మొదటి పరిచయం ఎక్కడో నీకు జ్ఞాపకం ఉందా?

శానయ్య—ఆ. పుష్కరాల్లో.

నరయ్య—అప్పుడు నీ కెన్నేళ్లూ?

శానయ్య—అప్పటి కప్పుడే నాకు అరటిక్కట్టు ఒప్పగునే వారు కారు.

నరయ్య—పోనీ, పదేళ్లనుకో. తరువాత, నీకు ఎన్ని పుష్కరాలు తెలుసూ?

శానయ్య—మొన్నటిదికాక, మూడు పుష్కరాల కెళ్లాను.

నరయ్య—మరి ఊరుకో. నీకు 58 దాటాయి, అధిక మాసాల్తో అరవై పై మాటలు! పన్నెండేళ్ల బాల కుమారుడులా మాట్లాడతావేం?

శానయ్య—నీ మొహం?

నరయ్య—ఛీ ఊరుకో! ఈలెక్క సిసలు. నీమాట చొప్పునేగా నేకట్టింది! ఇక నాహృదయం చెప్పమన్నావ్

గా! మన్లో మనమాట— నీకుపెళ్లేమిటిరా నీమొహం! పెళ్లనేది ఎరిగో ఎరక్కో సాహసించే యువకులికిగాని, ఇన్నేళ్లొచ్చి, ఎంతో ఆలోచన ఉండవలసిన నీకా? ఇంతవరకూ స్వేచ్ఛగా ఉండి, ఇప్పుడు బరువుఎత్తుగుని భర్తవు కావాలనా అపోరిస్తున్నావ్?

శానయ్య—నేను ఒకపిల్లని నిశ్చయం చేసుగున్నాను. ఆపిల్లని నేను పెళ్లిచేసుగుంటే, నన్ను అనేది ఎవడు?

నరయ్య—అల్లాచెప్పూ! నువ్వు మొదట్లో ఆ మాట చెప్పందే?

శానయ్య—ఆ అమ్మాయి నాకంటికి బంగారంలా ఉంది. (తలవంచుగుని సిగ్గభినయించి) నేను ఆమెని మోహించాను.

నరయ్య—నిజంగా?

[గాను.

శానయ్య—నిజంగా. వాళ్లనాన్ననికూడా అడి

నరయ్య—ఇదోటా?

శానయ్య—అవును. ఈరాత్రే సుముహూర్తం. నగలుకొనాలి. తాంబూలాలు అయిపోయినాయి.

నరయ్య—ఓ! భేషుగ్గాఉంది. అవస్యం పెళ్లాడు. నాసలహా యేమిటి మధ్య?

శానయ్య—స్నేహాన్నిబట్టి సలహాకొచ్చాను. ఏమిటి నీ ఊహ? అక్కడికి నా పెళ్లిమాట నేను అననే కూడదనా? యథార్థ విషయాలు చూడ్డం మానేసి, మాటికి ముందు నా వయస్సు గుణించడం యెందుకూ? (మీసం దువ్వి) ముప్పయి యేళ్లవాణ్ణి యెవణ్ణయినా సరే రమ్మను నాతోటి! ఎవడొస్తాడో, ఈ బస్తీలో! (అని సకిలించి బస్కీతీస్తాడు) నాకో చత్వారమా? ఓ ఇదా? నన్ను గంఃకావిడేసి నడిపించాలా? నాకు దంతాలు లేవా? (అని పళ్లూ దంతాలూ చూపిస్తాడు) ఏమంటావ్?

సరయ్య—నాది కేవలం బుద్ధితక్కువ. నువ్వు అవశ్యం పెళ్లాడాలి.

శానయ్య—వెనక నాకు పెళ్లంటే మంటగా ఉండేది. కాని రెండుమూడు సభలతో నా ఊహ మారిపోయింది. మొదటిమాట, పెళ్లివల్ల పెళ్లాం వస్తుంది. వచ్చి, ఆర్చడం, తీర్చడం, అలగడం, ఏడవడం, లాంటి తమాషాలు చేస్తుంది. రెండోమాట, నేను పెళ్లాడకపోతే నా వంశం అంతరిస్తుంది. మూడోమాట, పెళ్లాడితే, కుర్రకుంకలు బయల్దేరి "నాన్నా నాన్నా నాకేమన్నా తెచ్చిపెట్టవ్?" అంటూ కేకలేస్తూ ఏమీ తెలి

యని భాషలో అడుగుతూంటారు. ఏమో! (అని కళ్లు మూసుకుని) నాకు అప్పుడే పెళ్లిఅయినట్టూ, నలుగు రెదుగురు పిలలు చుటూ మూగినటూ అనిపిసోంది? ఇదుగో! వీడు చొక్కా పట్టుకు లాగుతున్నాడు. (కోప్పడి) ఉండరా! (నవ్వుతూ) చొక్కా చిరుగుతుంది, వొదిలి పెట్టమ్మా! మీ అమ్మదగ్గిరకెళ్లు! యేయ్! వీణ్ణి తీసెయ్!

సరయ్య—(వెళ్ళి శానయ్య చెవులో 'ఏమ య్యోయ్' అని అరిచి, అతడు కళ్ళు తెరిచిన తరవాత) దివ్యంగా ఉంటుంది. శీఘ్రంగా పెళ్ళాడు. (అని వేళా కోళంగా నవ్వుతాడు)

శానయ్య—నిజంగా! నీ సలహా పెళ్ళాడమనేనా?

సరయ్య—అవును. అంతకంటె ఎం జేస్తావ్?

శానయ్య—నీవంటి దగ్గిరస్నేహితు డుండబట్టి నాకింత అమూల్యమైన సలహా దొరికింది.

సరయ్య—పెళ్ళికూతురు ఎవరూ? అన్నట్టు.

శానయ్య—శాంత!

సరయ్య—ఎరుపుగా ఉంటుందీ, పోగ్గా డ్రెస్సు వేసుకు వెడుతూంటుందీ!

శానయ్య—అవును.

సరయ్య—రాజాలుగారి కూతురూ?

శానయ్య—మరే.

సరయ్య—చచ్చాంరా, దేవుడా!

శానయ్య—ఏం ఏం?

సరయ్య—ఏమీ లేదూ, చాలా బాగుంటుందిలే. తక్షణం పెళ్ళాడు.

శా—పిల్లని ఎన్నుకోడంలో నా వివేకం యెంత అమోఘంగా ఉందీ?

సరయ్య—సందేహం ఏమిటి? చచ్చు వొదల గొట్టావు.

శానయ్య—ఇల్లాంటి సలహా యిచ్చినందుకు, విధేయుణ్ణి. వివాహానికి నువ్ లేందే నాకు తోచదు ఏదో పని తగిలిందనక, తప్పకుండా రావాలి.

సరయ్య—(లేచి) వస్తాలే......(అని కుడివేపుకి నడుస్తాడు)

శానయ్య—(లేచి) ఉంటాను.

సరయ్య—వెళ్ళొస్తా. అనుకూలదాంపత్యం—ఆవిడికి యిరవై, ఈయనకి అరవై. ముమ్మాటికీ బాగుందనుకోవచ్చు, మూడుముక్కలు కావచ్చు. (వెళ్ళిపోతాడు)

## 2వ రంగం.

—o—

[కాషాయి బట్ట కట్టుగుని, చొక్కా తొడుక్కుని శిఖామణి కూచుంటాడు. పుస్తకాలూ ఉంటాయి.
కుడినుంచి శానయ్యవచ్చి, నమస్కరించి,
ఒక విభూతిపండు తీసి]

శానయ్య—శిఖామణి వేదాంతిగారు! తమరు ఈ పండు పుచ్చుగోవాలి.

శిఖామణి—నారాయణ! (అని అందుకుని అది పక్కని పెడతాడు)

శానయ్య—తమరు చాలాజ్ఞానులని వింటాను.

శిఖామణి—పేరు?

శానయ్య—శానయ్య

శిఖామణి—(కూర్చోమని వేలితోఅని) నాతో మీకు ఏంపని?

శానయ్య—కాస్త సలహాకావాలండి. ఒక విషయంనాకు చాలా స్వంత విషయం ఉంది, దాన్ని గురించి! అంచేతే నేవచ్చాను.

శిఖామణి—శానయ్యగారూ! తమ మాటధోరణి మార్చాలి ప్రపంచం మిథ్య. అనుమానం! అంచేత

'నే వచ్చాను' అని మీరు అనడం తప్పు. 'నేను వచ్చినట్టు నాకు అనిపిస్తోంది'' అనాలి.

శానయ్య—అనిపించడమా?

శిఖామణి—అవును.

శానయ్య—నే వచ్చాగా! ఇంకా అనిపించడమేమిటి?

శిఖామణి—అదే అనుమానం అంటే! మనం ప్రతీదీ అనుమానించాలి.

శానయ్య—అనుమానమేమిటి, మీ తలకాయ్! నేను ఇక్కడలేనూ? మనం మాట్లాడుకోడం లేదూ?

శిఖామణి—మీరు ఉన్నారని నేను అనుకుంటూన్నాను! నేను ఉన్నానని మీరు అనుకుంటున్నారు! మనం మాట్లాడుకుంటున్నాం అని మనం అనుకుంటున్నాం! (అని చిరునవ్వుతో చూస్తాడు)

శా—మీ మొహంలాఉంది! వేళాకోళంలోకి దిగారేం? ఉండడం, ఉన్నాం అనుకోడం, అంటూ తర్కంలో పడ్డారేం! ఈ సూక్ష్మాలు అల్లాఉంచి, వ్యవహారంలోకి వస్తాం. నేను పెళ్ళిఆడ్డం స్థిరం అయినట్టు మీతో చెప్పాలనిన్నీ, మీ సలహాకోసమున్నూ, వచ్చాను.

శిఖామణి—ఆ సంగతి నాకు ఎంతమాత్రం తెలియదు.

శానయ్య—నే చెబుతున్నాగా ?

శిఖామణి—అయితే కావచ్చు.

శానయ్య—పెళ్ళికూతురు చాలా అందంగా, ఇదిగా, ఎల్లాఉండాలో అల్లా ఉంటుంది.

శిఖామణి—అసంభవం కాదు.

శానయ్య—ఆ అమ్మాయిని నేను పెళ్ళి చేసుగోడం తప్పా ఒప్పా ?

శిఖామణి—తప్పకుండా ఏదో ఓటి.

శానయ్య—(తనలో) ఓరి వీడి దుంపతెగా! తేలడేం ? (పైకి) నేను ఆపెళ్ళి చేసుగుంటే నాకు శ్రేయస్సేనా అని మిమ్మల్ని అడుగుతున్నాను.

శిఖామణి—ఎమోమరి దానికంతా ఉంది. (అని ధ్యానించడంలో పడతాడు)

శానయ్య—పెళ్ళి చేసుగోడం తప్పా ?

శిఖామణి—బహుశా.

శానయ్య—(పళ్ళుబిగించి) స్పష్టంగా ఏడవ్వయ్యా !

శిఖామణి—నా ఊహ అదే.

శానయ్య—నాకు ఆ అమ్మాయి అంటే చాలా యిష్టం.

శిఖామణి—కావచ్చు.

శానయ్య—వాళ్ళ నాన్నే ఇచ్చాడు నాకు ఆ అమ్మాయిని.

శిఖామణి—అట్లాకూడా అనుకోవచ్చు.

శానయ్య—ఇప్పుడడిగేది ఏమిటంటే, ఒకవేళ తీరా పెళ్ళిచేసుగుంటే, ఆ అమ్మాయి నన్ను మోసపుచ్చదు గదా అని.

శిఖామణి—ఆమాట నిజమే.

శానయ్య—నీ అభిప్రాయం ఏమిటి.

శిఖామణి—(తల పంకించి) ఆలాగే.

శానయ్య—అదికాదయ్యా చవటా! నాస్థితిలో నువ్వున్నావ్ అనుకో, ఏంజేస్తావ్ ?

శిఖామణి—(గాఢిగా) అవును !

శానయ్య—నీ సలహా ఏమటి ?

శిఖామణి—నీకు ఏది ఇష్టమో అది !

శానయ్య—నాకు మతి పోయేట్టుంది.

శిఖామణి—అందుకు నేను కర్తనుగాను !

శానయ్య—హాంహారి నిన్ను తగలెయ్యా !

శిఖామణి—కాదలచినది కావచ్చు!

శానయ్య—చంపేస్తున్నావురా పీనుగా! (అని కర్రతో శిఖామణిని కొడతాడు)

శిఖామణి—ఓరి పశువా నీ క్షేమివచ్చిందిరా!

శానయ్య—తెలివితక్కువ పేలాపనకి బహు మతీ.

శిఖామణి—ఏమి నీపొగరూ? ఇదేనా మర్యాదా? నా అంతజ్ఞానిని కొడతావురా?

శానయ్య—(కూచుని భాసింపట్టు వేసుగుని, చిరునవ్వుతో) శిఖామణిగారూ! తమమాట ధోరణి మార్చాలి, మనం ప్రతీదీ అనుమానించాలి. "నన్ను కొట్టావు" అని అనకూడదు. "కొట్టినట్టు అనిపిస్తోంది" అనాలి.

శిఖామణి—నేను వెళ్ళి పిర్యాదు చేస్తాను.

శానయ్య—(నవ్వుతూ) అందుకు నేను కర్తను గాను.

శిఖామణి—ఇవిగో దెబ్బలు కనబడుతూంటేనే!

శానయ్య—కావచ్చు!

శిఖామణి—నువ్వే నన్ను ఇల్లా చేసింది.

శానయ్య—అందులో అసంభవం ఏమీలేదు.

శిఖామణి—నీకు వారంటు పెట్టిస్తా!

శానయ్య—నాకు తెలియదు.

శిఖామణి—నీపని పడతా!

శానయ్య—కాదలచినది, కావచ్చు!

శిఖామణి—కాకపోవచ్చు!

(ఎడమవేపుకి వెళ్ళిపోతాడు
శానయ్య కుడిపక్కకి నిష్క్రమిస్తాడు)

## 3 వ రంగం

[శాంత ఇంటి ముందువీధి. ఎడమనించి శానయ్యవస్తాడు]

శానయ్య-(తనలో, ఇటూ అటూ నడిచి, ఆలోచిస్తూ) వాకబు చేసిన కొద్దీ అనుమానం జాస్తీ అవుతోంది. అందుకనే శిఖామణిగాణ్ణి మూ చెడ్డదెబ్బలు కొట్టాను. పొద్దున్నే నేను లేచే సరికి, బుడబుడక్కలవాడొకడొచ్చి నాకు శుభం జరుగుతుందన్నాడు. 'శుభం' అంటే ఏమిటిరా కుంకా అన్నాను. పెళ్ళి అన్నాడు. ఆపిల్ల వర్తన ఎల్లాంటిది అవుతుందిరా అన్నాను. అంటే నాకు అర్థంకాకుండా ఏవో ముక్కలు గబగబ లాడించాడు. పైగా, నిన్నరాత్తిరి నాకు పెద్ద కలొచ్చింది! సముద్రం

మీాద నేను పడవపికారుట. తుపానుట. దానికి అర్థం ఏమిటోమరోణ్ణి పట్టుగుని శకునం అడగాలి. మొదట ఈ శాంతని పిలిచి మరోమాటు మాట్లాడాలి. పెళ్లి జరిగినలగాయతు తిన్నగా ఉంటుందో ఉండదో దాన్నే అడిగితే తీరిపోతుంది.

(అని, ఈలవేసి, చిటిగేసి, "శాంతా! శాంతా!" అని పిలుస్తాడు. సంచీ ఎడంచేతికి వేళ్లాడుతూ, చెప్పులు తొడుక్కుని, గొడుగు వేసుగుని ప్రయాణభేరీలో శాంత వస్తుంది)

శానయ్య—(తనలో) మోహనాకారం! ఏమి అందం! ఏమి ఒయ్యారం! ఏ చవట దీన్ని చూసి పెళ్లాడకుండా ఉండగలడూ!

(పైకి) కాగల భర్తనైన నాకు కాగల భార్యా! ఎక్కడికి బయల్దేరు తున్నావు?

శాంత—పాపుమీాద పనుంది.

శానయ్య—మీానాన్న ఇంటో లేడుకద!

శాంత—లేడు.

శానయ్య—ఓసీ! నా బహిఃప్రాణమా! మనకి ఇక పెళ్లి కాబోతుంది. ఇక్కణ్ణించి, నువ్వు నేను చెప్పినట్లాా వింటూాండాలిగాని పేచీలు పెట్టగూడదు. నేటినుంచి

నువ్వు నాసొమ్ము. నా సంబంధం నీకు చాలా సంతోషంగా లేదూ?

శాంత—ఇంకా నిమ్మళంగా అంటారేం! నాసంతోషానికి మేరలేదు.

శానయ్య—ఎంచేత చెప్పగో! (అని చిరునవ్వుతో కనుబొమ్మలు పైకెట్టి చూస్తాడు.)

శాంత—ఎంచేతంటే, మానాన్న వొట్టిత్యాష్ట్రిం. ఇన్నాళ్ళనించీ నాకు స్వేచ్ఛ లేకుండాచేసి మానాన్న నన్ను ఖాయిదాలో ఉంచాడు. ఖాయిదాపద్ధతి నాకు అయిష్టం. నాకు స్వాతంత్ర్యం కావాలి. దేవుడు, ఇప్పటికి, మిమ్మల్ని కనపరిచాడు.

శానయ్య—ఇదోటా! (అనికొంచెం తెల్లబోతాడు)

శాంత—మిమ్మల్ని పెళ్ళాడ్డంతోటే నాకు కావలసినంత స్వేచ్ఛ మీరు ఇవ్వకమానరు. "పెళ్ళాలు దివాంధాలులాపడి ఉండవలసిన పదార్థాలు" అని వాదించే భర్తల జాతికాదు మీది. మీరెక్కడా! మీరు యోగ్యులు, అనుభవశాలురు.

శానయ్య—సరి సరి.

శాంత—ఒంటిరిగాఉంటే, నాకు తోచదు—మీకుమల్లేనే. నేనూ మనిషినే. నాటకాలు, మీటిం

గులు, పిక్నిక్కులు, పార్టీలు అంటే నేనూ చెవికోసు కుంటాను—మీకుమల్లేనే. నావంటిది మీకు దొరకడం ఉభయతారకం.

శానయ్య—(మొహం చిట్లిఁచుగుని. తల ఊఁ గించి) అడ్డమా!

శాంత—మనం దెబ్బలాడుకోకూడదు.

శానయ్య—కూడదు.

శాంత—మనం ఒకర్ని ఒకరు అనుమానించ కూడదు.

శానయ్య—కూడదు.

శాంత—అనగా, నేను ఎవరితోటేనా కాస్త ఇదిగా మాట్లాడుతూంటే మీరు ఒక్కరూ కూచుని మనస్సులో ఇదవకూడదు.

శానయ్య—అల్లాగే, అల్లాగే.

శాంత—మీవల్లో నేను జోక్యం కలగజేసుకోను.

శానయ్య—పాపం!

శాంత—నావనుల్ని గురించి మీరు యాగీ చెయ్యకూడదు. మనకి అన్యోన్యవిశ్వాసం ఉండాలి.

శానయ్య—తెలిసింది, తెలిసింది.

శాంత—మీా రెల్లానో ఊరుకున్నారేం? మీా మొహం బొత్తిగా మాడిపోయి పొగచూరి పోతూందేం?

శానయ్య—(చికిలించి) నాకు కొంచెం కళ్ళు చిఱుతలు కమ్ముతున్నాయిలే, తల తిరుగుతూంది.

శాంత—ఈకాలంలో ఆజబ్బు మామూలైంది, కాని మనపెళ్ళితో, అల్లాంటి హెచ్చుతగ్గులు తంగున సర్దుకుంటాయి. సెలవు. నాకీ డ్రెస్సు బాగుండలేదు. బజార్లోకి వెళ్లి, కొత్తడ్రెస్సు పురమాయించి, బిల్లు తమకి పంపుతాను. (అని వేలుతో శానయ్య బుగ్గతాటించి, రివ్వున వెళ్ళిపోతుంది.)

శానయ్య—(తనబుగ్గ తను తాటుగుంటూ) ఇదేమిటీ! ఇహాను ఇది నామాట ఏం వింటుందీ? ఎంత చిక్కొచ్చిందీ! ఎల్లా ఈపెళ్లి రద్దుచేసుగోడం? సరయ్య మాట విన్నాను కానుగదా! శిఖామణి చెప్పినట్లు అనుమానం మంచిదిలా కనపడుతోంది. సరయ్య కనపడితే బాగుండును! (వెనక్కి తిరిగి) అడుగో! సరయ్యా!

సరయ్య—ఓయ్! నీకోసమే! నగలు కొంటానన్నావు. షాహుకార్ని రమ్మన్నాను.

శానయ్య—అదికాదు, మాట!

సరయ్య—నీచురుకు తగ్గినట్టుందేం?

శానయ్య—కొన్ని చిక్కులు బయల్దేరాయి. నేను యింకా ఆలోచించవలసొచ్చింది. ఇంకా తరిస్తే గాని పెళ్లి చేసుగోను.

సరయ్య—నే వెడతాను. నాకు తీరుబడిలేదు.

శానయ్య—అది కాదోయ్! నాకు ఓ కలొచ్చింది.

సరయ్య—(వెళ్ళిపోతూ) అయితే ఏమంటావు?

శానయ్య—దానికి కాస్త అర్థం చెబుతావేమో అని.

సరయ్య—ప్రశ్న కనుక్కో, నాకేం తెలుసు? (అని ఎడమకి వెళ్లిపోతాడు)

శానయ్య—స్నేహాలు ఇల్లానే ఉంటాయి. ఇక శాంత తండ్రిని కలుసుగుని, మాట్లాడి. ఈసైతాను పెళ్లి వొదిలించుగోవాలి, బాబూ! (అని ఉసూరుమంటూ కుడిపక్కకి వెళ్లిపోతాడు)

## 4 వ రంగం

(శాంత తమరియింట్లో ఒక కుర్చీమీద కూర్చుని చదువుకుంటూ ఉంటుంది. ఎడమవేపునుంచి చంద్రుడు వస్తాడు. శాంతలేచి, షేక్‌హాండు ఇచ్చి అతణ్ణి కుర్చీ

మీద కూర్చోమంటుంది. అతడు, దీనంగా, కుర్చీలో కూలబడి మూలుగుతాడు)

శాంత—ఏమిటండీ, విశేషాలు ?.

చంద్రుడు—ఏమున్నాయి ? నువ్వే పెద్దవిశేషం.

శాంత—అదేమిటి అల్లా అంటున్నారు ?

చంద్రుడు:—నాకు ఎన్నిరీముల ప్రేమజాబులు రాశావ్ ? ఎన్నిమార్లు మాట ఇచ్చావ్ ?

శాంత—నిజమే. లేదన్నానా ఇప్పుడు మాత్రం?

చంద్రుడు:—ఇప్పుడు శానయ్య సంబంధం మాట [నిజమే?

శాంత—ఆ.

(కుడిపక్కకి శానయ్య వచ్చి, మాటలు, ఆలకించి నోరు నొక్కుగుంటాడు.)

చంద్రుడు:—పెళ్ళి రూఢే ?

శాంత—ఆ.

చంద్రుడు—ఈరాత్రే ?

శాంత—అవును.

చంద్రుడు—అవురా! (అని ముక్కుమీద వేలుంచుగుని) ఎంతక్రూరురాలవో చూడు! నాజీవితం అంతా నీకోసం పాడుచేసుగున్నాను. ధనంకుడా చాలా అయిపోయింది. ఇక విషం పుచ్చుగోవాలి.

శాంత—మీయందు నా ప్రేమ యథాప్రకారం గానే ఉంది, ఉంటుంది. మనం పెళ్ళాడేస్తే కాపరం సాగించడం ఎల్లా? నాదగ్గిరా కానిలేదు, మీదగ్గిరా లేదు. ధనం లేందే జగత్తులేదు. అందుకని, అతడి ధనాన్ని ప్రేమించి అతణ్ణి పెళ్ళాడతానన్నాను గాని, అతనితో కాపరం చెయ్యను. కూడా ఉంటాను! అతడూ ఆట్టేకాలం ఉండడు. (శానయ్య ఉలిక్కిపడి ఆగ్రహం చూపించాలి) మరి ఆరునెల్లనాటికి అతను పైసలు. అప్పుడు నాయిష్టం, అనగా మనపెళ్ళి! (శానయ్యని చూసి, సిగ్గుతెచ్చిపెట్టుగుని) రండి; మిమల్నిగురించే నేను మాట్టాడుతూన్నది. మీ గొప్ప చెప్పుగుంటున్నాను.

చంద్రుడు—నువ్వన్న పెద్దమనిషి...

శాంత—అవును. ఈపెద్దమనిషే నన్ను వరించారు.

చంద్రుడు—అయ్యా! తమ వివాహసందర్భంలో తమర్ని కడుంగడు అభినందిస్తున్నాను. తమ విధేయుణ్ణని నమ్మండి. ఇంతకంటె మర్యాదగల పెళ్లికూతురు భూమి మీదలేదు. శాంతా! ఇంతకంటె లక్షణాలుగల భర్త నీకు దొరకడు. అతని ధోరణి చూస్తేనే, గొప్ప భర్త

లాగ కనిపిస్తున్నాడేమిటి? తమ స్నేహితుణ్ణి. ఎప్పు డేనా దర్శనం దయచెయ్యండి.

శాంత—సరే. సెలవు.

(చంద్రుడు ఎడమకి వెళ్లిపోతాడు.)

శానయ్య—మీనాన్న ఇంట్లో ఉన్నాడా?

శాంత—ఇంకా రాలేదు.

(శానయ్య కుడివేపుకి పోతాడు.)

## 5 వ రం గం

(రాజాలుగారి యిల్లు. వీధిగది. రాజాలు పత్రిక చదువుతూ ఉంటాడు. శానయ్య కుడివేపునించి ఒక్క అడుగువచ్చి, నిలబడి, నిట్టూర్పు విడుస్తాడు.)

శానయ్య—(తనలో) ఈపెళ్ళి ఉరి ఎల్లానేనా తప్పించుగోవాలి. (పైకి) ఏమండోయి!

రాజాలు—ఓ హోహో! లోపలికి దయచె య్యండి, అల్లుడుగారు!

శానయ్య—విధేయుణ్ణి.

రాజాలు—ముహూర్తానికి చాలావ్యవధి ఉన్న ట్టుంది. అప్పిడే తర్లివచ్చారా?

శానయ్య—క్షమించాలి.

రాజాలు—నాకూ తొందరగానే ఉంది, ముహూర్తం ఎప్పుడు వచ్చునా అని.

శానయ్య—నేను వేరే పనిమీద వచ్చాను.

రాజాలు—నేను అందరికీ అడ్వాన్సులు కట్టేశాను. బాజాభజంత్రీలు, పాటకులు, బూటకులు, భోజనాలు, తాంబూలాలు, అన్నీ రెడీ. మాపిల్లకూడా ముస్తాబు అవుతోంది! మీరే తరువాయి.

శానయ్య—నేను...అందునిమిత్తం రాలేదు.

రాజాలు—ఏర్పాట్లన్నీ మీకు నచ్చేటట్టే జరుపుతాంలెండి.

శానయ్య—అది కాదయ్యా, వినిపించుగోక వచ్చావేం, నేను మరోపనికోసం వచ్చానంటూంటే!

రాజాలు—చాలుగాని, రావయ్యా,అల్లుడుకాన.

(అని జబ్బపట్టుగుని కుర్చీమీద కూర్చోపెడతాడు శానయ్య లేచి మళ్లీ మెడంగా వెడతాడు.)

శానయ్య—ఒకటి రెండుమాటలు తమతో చెప్పాలి.

రాజాలు—ఏమిటయ్యా పట్టింపులూ! ఇప్పణ్ణించీ అలకే! బాబ్బాబు! (అని గడ్డం పట్టుగుని) ముందు వచ్చికూచో.

శానయ్య—నేను కూచోను. మొదట మీతో ఓమాట చెప్పాలి.

రాజాలు—ఒక మాటా?

శానయ్య—అవును.

రాజాలు—ఏమిటది?

శానయ్య—నేను, తమకూతుర్ని, నాకిమ్మని, మిమ్మల్ని లోగడ అడిగినమాట వాస్తవమే. అందుకు మీరు ఒప్పుకున్నమాట కూడా నిజమే. కాని,

రాజాలు—కాని...

శానయ్య—కాని, నేను కొంచెం ముదురు. ఆ అమ్మాయిలేత. నావంటివాడు ఆమెకి తగడు.

రాజాలు—క్షమించాలి. మీరు మాపిల్లకి పూర్తిగా నచ్చారట. మీతో సుఖంగా జీవిస్తుందిట, మాపిల్ల.

శానయ్య—కాదయ్యా! నాకు మాచెడ్డతిక్క. అప్పుడప్పుడునాకు పైత్యిస్తుంది.

రాజాలు—అల్లాంటప్పుడు మాఅమ్మాయి జాగ్రత్తపడగల మనిషే! ఏమీ ఫర్వాలేదు.

శానయ్య—సరేలెండి. నేను అవకరపు మనిషినని ఆవిడికి అసహ్యాం వెయ్యవచ్చు!

రాజాలు—వేస్తేం? గుణవంతురాలి యొక్క మొగుడు ఎంత అసహ్యంగా ఉంటే అంత ఎక్కువ పేరు ప్రతిష్ఠలు ఆవిడికి వస్తాయి.

శానయ్య—మీ అమ్మాయిని నాకివ్వద్దని నీకు సలహా యిస్తున్నాను. ఇప్పుడేనా గ్రహించుకో?

రాజాలు—ఛీ! వెధవప్రాణం పోయినాసరేగాని, నేను మాట తిరగను. మాపిల్లని మీకే యిచ్చి తీరతాను.

శానయ్య—(నవ్వుతూ) పోనీ, మీరు మాట తప్పినందుకు నేను ఏమీ అనుకోను లెండి.

రాజాలు—ఒకమాట చెప్తాను వినండి. మీయందునాకుండే గౌరవం ఎల్లాంటిదంటే, అవతల ఓ మహారాజువచ్చి మా అమ్మాయిని పెళ్లాడతానన్నా సరే, వాడికి మానేసి, పిల్లదాన్ని తమ చేతుల్లో ఉంచాలిగాని, మరోటుందా?

శానయ్య—మీరు నాయందు ఇంత ఆదరణ చూపినందుకు కృతజ్ఞుణ్ణి. కాని, నేను, మీ అమ్మాయిని పెళ్లాడడానికి వీలులేకుండా వచ్చిందని చెప్పడానికి సాహసిస్తున్నాను.

రాజాలు—ఏమిటీ? నువ్వు మా అమ్మాయిని పెళ్లాడవ్?

శానయ్య—ఆడను.

రాజాలు—ఏం? నీకేంవచ్చింది?

శానయ్య—ఏంలేదూ! నేను పెళ్లికితగను. పైగా, మానాన్నా, మా తాతా, మరి మా గోత్రంలో ఎవళ్లూ కూడా పెళ్లిచేసుగోడం ఆనవాయితు లేదుట.

రాజాలు—మా భాగే. ఎవరియిష్టం వారిది. బలవంతం ఎక్కడా పనికిరాదు. కాని మొదట నువ్వు మా అమ్మాయిని పెళ్లాడతానన్నావు. అంతా సిద్ధం అయింది. ఇప్పుడు నువ్వు వెనక్కి తీస్తున్నావు. కాబట్టి, నేను ఏంచెయ్యాగల్నో చూస్తాను. ఒక్కక్షణం ఉండు.

(అని లోపలికి వెడతాడు)

శానయ్య—ఏముటో అనుకున్నాను. వీడు కాస్త నయమే. ఇంత త్వరగా ఈ బంధం తెంపుగోవచ్చు అనుకోలేదు. పెందరాళే మేలుకుండబట్టి గండం తప్పింది. కొంచెం అశ్రద్ధఅయితే, స్థిమితంగా ఏడవ వలిసొచ్చేది. వస్తున్నాడు.

రాజాలు—(వచ్చి, నవ్వి) అల్లానే కానియ్యి చ్చండీ!

శానయ్య—నామాట బోటోయినందుకు నాకు మట్టుకు ఎంత విచారంగా ఉందనుకున్నారు?

రాజాలు—దానికేంగాని, ఇవిచూడండి. పెద్ద రకం చాకులు! ఫస్టు! మీకేదికావాలో చూసుగుని, ఒకటి తీసుకోండి.

శానయ్య—(వెఱ్ఱిమొహంవేసి) నాకా?

రాజాలు—చిత్తం.

శానయ్య—ఎందుకదీ?

రాజాలు—మీరు మీమాట తప్పినందుకు మీకు బహుమతీ.

శానయ్య—అంటే?

రాజాలు—దెబ్బలాటల్లో, కొందరు కేకలేసుగుని, తిట్టుగుని, గోడవపడతారు. చడీచప్పుడూ కాకుండా పన్ను చెయ్యాలని మా మతం. తమరి అంగీకారం పుచ్చుగుని, అనుజ్ఞ తీసుగుని, మనం ఒకరి గొంతుకలు ఒకరు నిశ్శబ్దంగా నరుక్కోవాలని నామనవి.

శానయ్య—ఇదేంబహుమతీ నీ నెత్తిబహుమతీ!

రాజాలు—ఏమో! మీరు పిల్లనేనా ఒప్పుగోండి, కత్తియేనా పట్టుగోండి.

శానయ్య—తమకి విధేయుణ్నేగాని, దేవుడు నాకీ గొంతుకఇచ్చింది, కత్తిపెట్టి పొడిపించుగోడానికి గాదు.

(తనలో) ఇంత అమర్యాదగా మాట్లాడతాడేం, పీనుగూ!

రాజాలు—అయినాసరే, ఇల్లా జరపడానికి, తమ సెలవు నిరీక్షిస్తున్నాను.

శానయ్యా—వీల్లేదు, చాల్లెండి ఎవడేనా నవ్వి పోతాడు.

రాజాలు—త్వరగా రండి. నాకు వేరే పనుంది. పెళ్లి ఆడరుకాదూ?

శానయ్యా—ఆడను.

రాజాలు—(కర్రతో శానయ్యని రెండుకొట్టి) అల్లాయితే మీరు నోరెత్తకూడదు. నేను అన్నీ యథా విధిగా చేసే మనిషిని. మీరు మాట తిరిగిపోయారు. నేను పోట్లాడమన్నాను! మీరు జంకారు. మిమ్మల్ని నేను దంచాను. ఇదంతా లా ప్రకారం రైటు. కాదని మీరు ఏ మొహం పెట్టుగుని అనగల్రో చెప్పండి.

శానయ్యా—(తనలో) ఓరి శని వెధవా! చావ గొడుతున్నాడేం మరీనూ!

(పైకి) ఏమిటయ్యా నువ్వనేదీ? నేను కత్తిసాం చెయ్యలేను, చాకుసాం కూడా నాకు తెలియదు.

రాజాలు—నిజంగా.

శానయ్యా—నిజంగా.

రాజాలు—అల్లాయితే పెళ్ళాడు.

శానయ్యా—ఆడను.

రాజాలు—(కర్రతో మళ్లీ ర్గొండుకొట్టి) తమ అనుజ్ఞ తరువాత యిద్దురుగాని లెండి. ప్రస్తుతం మిమ్మల్ని నేను కొట్టవలసిఉంటుంది.

శానయ్యా—కొట్టకురా, నిన్ను చంపెయ్యా!

రాజాలు—నాకూ ఎంతవిచారంగా ఉందీ? కాని గత్యంతరంలేదు. అయితే మీరు ఓసమాధానం చెప్పే వరకూ మిమ్మల్ని వదలడం అశాస్త్రీయం!

(అని మళ్లీ కర్ర ఎత్తుతాడు)

శానయ్యా—ఓరి నీమొహం మండా, పెళ్ళే చేసుగుంటానయ్యా!

(కుడివేపునించి గబగబా సరయ్య వస్తాడు)

సరయ్యా—సుముహూర్తం గావును, శానయ్యా! నువ్వు నన్ను నీపెళ్లికి రమ్మని పిల్చావ్! పెళ్లిఅంటే, దెబ్బలపెళ్లి అనా నీఉద్దేశం?

శానయ్యా—నాయెదం పోదూ! స్నేహితుడికి జాలి లేకపోతే, శత్రువుకి ఉంటుందా?

(అని ఖిన్నుడై పోతాడు)

సరయ్య—ఆగండి, రాజాలుగారు! ఏమిటిసంగతి?

రాజాలు—యావత్తూ సిద్ధం అయింతరువాత నా కూతుర్ని పెళ్లాడనని కూచున్నాడు. కాని, పెళ్లాడే వరకూ నేను వారిని చావగొట్టవలసిన అవసరం వచ్చింది.

సరయ్య—ఏమయ్యా?

శానయ్య—కాదయ్యా, ఇందాకా మీఅమ్మాయి చంద్రుడితో గుసగుసలాడుతోంది. నే విన్నాను. నాడబ్బుని పెళ్లాడుతోందిటగాని, నన్ను కాదుట! నా అనంతరం వాళ్లిద్దరూ పెళ్ళి చేసుగుంటారట!

సరయ్య—అందుకని, నాసలహా ఇప్పుడేనా విన పడుతుందా!

శానయ్య—ఇంకా వ్వి (అని లెంపలు కొట్టుగుని) నపడకపోతుందా?

సరయ్య—(కాగితం ముక్కతీసి) అల్లాఅయితే ఈ కాగితంమీాద సంతకం చెయ్యి!

శానయ్య—(చేస్తాడు)

సరయ్య—మీా అమ్మాయిని పిలవండి రాజాలు గారు!

రాజాలు—అమ్మాయి! (అని పక్కకిచూసి పిలుస్తాడు)

శాంత—(వస్తుంది)

సరయ్య—శానయ్యని నువ్వుడబ్బుకోసంమాత్రం పెళ్లాడుతున్నానని నీప్రియుడైన చంద్రుడితో చెప్పావుట, నిజమే?

శాంత—ఆహా, నిజమే!

సరయ్య—అయితే విను. శానయ్య స్థిరాస్తి నలభై యకరాలు అల్లాఉండనీ. అతనికి రొఖ్ఖం నాలుగు వేలుంది. ఆసొమ్ము నీకిచ్చేస్తే నువ్వు అతణ్ని పెళ్లాడ్డం మానేస్తావా?

శాంత—ఆ. నాకు ఎప్పుడూ కూడా చంద్రుడి మీదే ప్రేమ.

సరయ్య—శానయ్య తన నాలుగువేలూ భద్రంగారనే ఒక లక్షాధికారిదగ్గిర దాచుకున్నాడు. రూపాయి వడ్డీకి అది యిప్పుడు ఆరువేలయింది. అది యావత్తూ శానయ్య నీకు విలియావేశాడు. నువ్వు భద్రంగారిదగ్గిర వసూలుచేసుకో. ఇదిగో కాగితం.

శాంత—(కాగితం చూసుగుని) ఇంత గొప్ప సలహా చెప్పినందుకు మీకు మేంకృతజ్ఞులం.

సరయ్య—రాజులు గారూ! చంద్రుడిగార్ని రమ్మని సుముహూర్తం దాటకుండా కార్యం జరపండి.

రాజాలు—(లోపలికి వెళ్లి చంద్రుణ్ని వెంట పెట్టుకువచ్చి) అమ్మాయి! రా!

(అని యిద్దరి చేతులూ కలిపి) అమ్మయ్యా! ఇక ఈపిల్లపూచీ నీది. (వెడుతూ తనలో) మా అమ్మాయి ఎవర్ని పెళ్లాడితేం గాని, నాకు బరువు తగ్గింది.

(రాజాలూ, శాంతా, చంద్రుడూ ఎడమ వేపుకి నిష్క్రమిస్తారు.)

సరయ్య—(వాళ్లంతా నిష్క్రమిస్తూండగా) శానయ్యా! మనం మరి వెడదాం రా! (అని కుడి వేపుకి జరుగుతూండగా శానయ్య వెనకాల నడుస్తాడు. నడుస్తూ)

శానయ్య—నెత్తురూ చీమూ ధారపోసి కూడ బెట్టిన డబ్బు గంగపాలు చేశావుకదా, సరయ్యా! అయినా సరేలే! నీమాట నాకు గురి!

సరయ్య—ఎంజేస్తాం! నువ్వు ఇంకా విన్లేదు కావును. భద్రంగారు లక్షాధికారి అయినా, సంపూర్ణంగా దివాలాదీశాడు. నీ అప్పులో ఒక్కచిల్లిగవ్వైనా వెనక్కిరాదు. అపత్రం నువ్వు ఎల్లానూ నాలిక గీసుగునే దేకదా, పోనీ వాళ్లమీాద పారెయ్యమన్నాను!

శానయ్య—అల్లానా! మ్మామంచిపని చేశావు. డబ్బుపోతే పీడాపోయిరి గాని, నీ ధర్మమా అని తప్పింది యీా "వద్దంటే పెళ్లి"

(నిష్క్రమిస్తారు)

# ఘ ట న

[“మోలియర్” రచించిన ప్రహసనాలలో ఒక దానికి ఇది అనుసరణం, చాలవరకు అనువాదం. ఇది, 7–3–1932 తారీఖున ఆర్ట్సుకాలేజీలో, యం. యస్. హెచ్. తాంప్సన్ దొరగారి అధ్యక్షతక్రింద జరిగిన సభాసందర్భంలో మొదటిసారి ప్రదర్శించారు)

పాత్రలు.

1. త్రివిక్రమం—ఒక గృహస్థు
2. నీలగిరి—కమలని ప్రేమించినవాడు
3. శానయ్య—నీలగిరికి సేవకుడు
4. కమల—త్రివిక్రమం ఇంట్లోఉన్న కోయపిల్ల
5. పనసయ్య—నీలగిరికి తండ్రి
6. హంసరాజు—పనసయ్యకి ఇష్టుడు

పాత్రధారులు.

1. త్రివిక్రమం—ఉలిమిరి సోమేశ్వరరావు
2. నీలగిరి—పుచ్చా పూర్ణానందం
3. శానయ్య—దుగ్గిరాల సత్యనారాయణరావు
4. కమల—ఐ. భావనాచార్యులు
5. పనసయ్య—ఎన్. వెంకయ్యపంతులు
6. హంసరాజు—సోమంచి యగ్గన్నశాస్త్రి

## 1 వ రంగం.

(కుడివేపునించి నీలగిరి ప్రవేశించి)

నీలగిరి—సరేలే, చంద్రుడూ! కాస్కో! వెనక, నేను హేమలతని ప్రేమించినప్పుడు, నువ్వూ దాన్నే ప్రేమించావు! ఇప్పుడు, నేను కమలకోసం ఇదవుతూంటే నువ్వూ కమలకోసమే యత్నిస్తున్నావ్! బాగా తయారవుమరి! చూద్దాం, ఎవరు నెగ్గుతారో!

(కుడివేపునించే, శానయ్య వస్తాడు)

నీలగిరి—ఏమోయ్! శానయ్యా!

శానయ్య—చిత్తం! ఏమిటి సంగతి?

నీలగిరి—సంగతా! కావలసినంత! నా మోహ వ్యాపారం అంతా బొత్తిగా అధాంద్రాగా ఉంటోంది. ఇటీవల నేను హంసరాజుగా రమ్మాయిని మానుకుని కమలని మోహిస్తూంటే, చంద్రుడూ ఆపిల్లనే ప్రేమిస్తున్నాట్ట, విన్నావా? వాడి దిప్పకాయి చేష్టలు!

శానయ్య—చంద్రుడా! కమలనా! ప్రేమిస్తున్నాడూ!

నీలగిరి—కళ్లకి అద్దుకుంటున్నాడంటే నమ్మ!

శానయ్య—చిక్కే!

నీలగిరి—ఇంకా నెమ్మదిగా అంటావేం? అంచేత నాకు మా చెడ్డకోపం వస్తూంది. అసలు నాకు భయమేమిటిలే? నువ్వన్నావుగా నాకూ! నీతో ఎప్పుడూ ఎత్తు వెయ్యలేదు. నువ్వు సేవక చక్రవర్తివిగాని, సాధారణ సేవకుడివా మరి!

శానయ్య—అయ్యా! ఇక మాటలు ఆట్టే ఖర్చు చెయ్యకండి. అవసరం ఉన్నప్పుడు ఇల్లానే మమ్మల్ని అందరం ఎక్కించి చిక్కుతోలగడంతోటే ఏదో చికాకు తెచ్చుగుని చెప్పుచ్చుగు కొడతారు.

నీలగిరి—అబ్బా, సరేగాని, కాస్సేపు కమల గురించి మాట్లాడు, నీకు పుణ్యం ఉంటుంది! ఆ అందం చూస్తే, ఆ అమ్మాయి గొప్పవంశంలో నేపుట్టి కారణాంతరంవల్ల ప్రస్తుతం త్రివిక్రమంగారి ఇంట్లో దాసీ అయి ఉందని అనుకుంటాను.

శానయ్య—లోపల అనుకోండి, ఈమాట చెబితే మీనాన్న కర్రుచ్చుగుంటాడు! అసలు మీవైఖరిచూసి ఆయన ఎప్పుడూ ధుమధుమలాడుతూనే ఉంటాడు. హంసరాజుగారి హేమలతని తమరికి ముడిడితేగాని మీకు కుదురురాదని ఆయన నాతో చెప్పాడు. ఊరూ పేరూ తెలియని కమలని మీరు ప్రేమిస్తున్నారని గనక

ఆయనవింటే ఆయనకోపం అట్ట చెలరేగిపోయి తుపాను లోకి దిగుతుంది. అందులో మీరు కొట్టుగుపోవచ్చు!

నీలగిరి—చాల్లే! ఇదా! నువ్వునాకు చెప్పడం?

శానయ్య—అహఁ, ఉన్న సంగతి మనవి చేశాను.

నీలగిరి—(కోపంగా) నీసంగతీ నీసలహా నాకక్కర్లేదు. నౌఖరు వాడొకడు నీతి బోధచేస్తూంటే వినే బాపతుకాదు మంది. నాకు కోపం రావడం నీకు లాభం లేదు.

శానయ్య—(తనలో) కొంచెం అందుకుంది (పైకి) అబ్బే! ఊరికే అన్నానండీ! సహజంగా ఉండే వ్యాపారాలు శానయ్య వద్దంటాడా! నాకు మంచితనం తప్ప రెండోది అక్కర్లేదు...అందుకని మీనాన్న చెప్పిన చవట మాటలు వినక, మీ మనస్సు చెప్పినరీతిగా నడవండి. ఈ ముసిలిఘటాలు ఊరుకోలేక, శ్రీరంగనీతులు చెప్పి, కాలవశంచేత తమరు జాగ్రత్తగా ఉండవలిసొచ్చి, యువకుల్నికూడా అల్లా ఉండమంటారు...నామజాకా మీకు తెలుసు, పంపండి మరి.

నీలగిరి—ఈమాట నచ్చింది! లోగడ నేను నాబాధ కమలకి నివేదించాను. ఆ అమ్మాయి నన్ను కొట్టి పారెయ్యలేదు. కాని, ఇప్పుడు చంద్రుడు ఒకడు

అడ్డొచ్చాడు. అందుచేత, నువ్వు ఏంఎత్తువేస్తావో, ఏం వ్యూహంపన్నుతావో ఏం జోను ఒగ్గుతావో! నీప్రజ్ఞం తా చూపెట్టి చంద్రుడి ఆట కట్టెయ్యాలి!

శానయ్య—అయితే కొంచెం ఆగండి (తనలో లాగ) ఇప్పుడు వీలేమిటీ!

నీలగిరి—మంచి ఎత్తు

శానయ్య—అబ్బ! ఉండండీ! ఏకతొందర. నాది నిదానించేబుర్ర! ఆఁ అదీ! మీరు...కాదు... అక్కడికి వెళ్ళి...

నీలగిరి—ఎక్కడికి?

శానయ్య—అది మంచిదికాదు. నేను ఒక మోస్తరుగా...

నీలగిరి—ఏమోస్తరు?

శానయ్య—అది నెగ్గదు. పోనీ ఓపనిచేస్తే...

నీలగిరి—ఎవరు? ఏంపని?

శానయ్య—ఎమో! నేనెరగను.

నీలగిరి—అబ్బ! చెబుతావా, లేదా? నాకు మతిపోతోంది.

శానయ్య—పోనీండి! మనకిప్పుడు ధనం ఉండాలి. త్రివిక్రమం మన్యపువర్తకం చేస్తాడు. కోయవాళ్లు వీడికి

కొంతబాకీపడి యిచ్చుగోలేక యీపిల్లని తాకట్టుపెట్టి వెళ్లారు. అదీగాక, త్రివిక్రమం, డబ్బుకోసం లెంపకాయలూ, గడ్డివగ్గ రా తినేస్తాడు. ఆడబ్బు వాడిమొహాన్ని కొడితే, ఆపిల్లని మనకి అమ్మేస్తాడు. కాని, మీనాన్న కానీ యివ్వడు. మీదగ్గిర దమ్మిడీలేదు. ఆగండి. కమలని దాచింది ఈగదిలోనే. అదే కిటికీ. నక్కని తొక్కివచ్చామండీ! ఆ అమ్మాయి ఇల్లా వస్తూంది.

(ఎడమనించి, కమలవస్తుంది)

నీలగిరి—ఇట్టి దివ్యసుందర విగ్రహం నాదృష్టిపథాన్ని పడేటట్టుచేసిన ఆదేవుణ్ని నేను ఎల్లాస్తోత్రం చెయ్యాలో తెలియటంలేదు. ఆ నేత్రాలేకదా నాకీబాధ కలిగించాయి!

కమల—నావల్ల ఇంకోరికి బాధకలుగుతుందని నేను అనుకోలేదు. ఒకవేళ, ఆబాధ, నానేత్రాలే కలిగించిఉంటే అది, నాఆజ్ఞ లేకుండా జరిగిన పనన్నమాట!

నీలగిరి—బాధంటే సరిగ్గాబాధేఅని నా అభిప్రాయంకాదులే!

శానయ్య—అయ్యా! సందర్భం మరిచిపోయి తమరు మేఘమండలంలో ఊరేగుతున్నారు. ఉన్నసంగతి మాట్టాడి తమరు త్వరగా ఇదవండి.

(లోపల్నించి త్రివిక్రమం "కమలా" అని కేకే స్తాడు)

శానయ్య—నే చెప్పాలా ?

వెధవకర్మం! ఆముసలాడు, పానకంలో పుడక లాగ, ఇప్పుడే రావాలీ!

శానయ్య—సరే. మీరు తప్పుగోండి. ఆయన్తో నేను మాట్లాడతాను.

(నీలగిరి, కుడివేపున దాక్కుంటాడు, ఎడమవేపు నించి త్రివిక్రమం వస్తాడు)

త్రివిక్రమం—(కమలతో) బయటికి ఎందుకొచ్చావ్ ? అవసరం ఏముంది రావడానికి ? నువ్వెవరితోనూ మాట్లాడకూడదని నేను ఆర్డరు వెయ్యలేదూ ?

కమల—అయ్యో కోపం చెయ్యకండి! కొంత కాలంకిందట నాకు ఈ యోగ్యుడి పరిచయం అయింది. ఇతణ్ణి అనుమానించవలసిన అవసరంలేదు !

శానయ్య—వీరేనా? త్రివిక్రమంమహానుభావులు?

కమల—అవును.

శానయ్య—స్వామీ, విధేయుణ్ని. ఇంతపేరు గల ప్రభువుని చూసేసరికి నాకు పట్టరాని ఆనందం అవుతోంది.

త్రివిక్రమం—అయ్యా, విధేయుణ్ని. ఏమి సెలవు!

శానయ్య—అయినా, తమరు పనిమీదవున్నట్టు న్నారు ఒక్కమాట చెప్తాను... ఈవిడ పరిచయం నాకు ఉంది.

త్రివిక్రమం—అయితే?

శానయ్య—ఈవిడకి సోది చెప్పడం తెలుసు. ఒక విషయం కనుక్కోవాలని వచ్చాను.

త్రివిక్రమం—ఏం? నీకు మాయవిద్యలుకూడా తెలుసునా?

కమల—మామూలు విద్యలే తెలుసును.

శానయ్య—(నకిలించి) నేను టూకీ తేలుస్తాను! మా యజమానిగారు మనస్సు పాడై ఉన్నారు.

కమల—(కళ్ళు మూసుగుని) అవును! ఒకపిల్లని గురించి!

శానయ్య—మాతల్లే, మాతల్లే! నిజం, నిజం! ఆయన ఎల్లానేనా ఆపిల్లదగ్గిరకి వెళ్ళి, తన ప్రేమయొక్క తీవ్రత చెప్పుగోవాలని ఏకబాధపడుతూన్నారు. కాని, ఆయనయొక్క ప్రేమనిధిమీద ఒకశక్తి అవహించి ఉంది. దీనికితోడు ఆయనికి శత్రువు ఓడు బయల్దేరాడు. ఇప్పుడు ప్రశ్న ఏమిటీఅంటే, మా యజమానికి ఆపిల్ల

దక్కుతుందా, దక్కదా? నిజం మీనోటంట రావాలి గాని, కడంవాళ్ళ లెక్క నాకు లేదు. అందుకనే మిమ్మల్ని అడగడం.

కమల—మీ యజమానికి జన్మరాశి యేది?

శానయ్య—కుంభరాశి గావును! మొత్తంమీద ప్రేమచాంచల్యం లేని రాశే.

కమల—సరే తెలిసింది. ఈపిల్ల పేరుకూడా తెలిసింది. నువ్వు మరి చెప్పనక్కరలేదు. ఇప్పుడు ఈపిల్ల కష్టాలలోఉన్నా తన ఆత్మగౌరవం నిలబెట్టుగునే మనస్థయిర్యం, కలిగిఉంది. ఈమెగుట్టు ఇతరులు గ్రహించలేరు.

శానయ్య—ఏమండీ! జ్యోతిషంయొక్క ప్రభావం!

కమల—మీయజమాని నిశ్చలుడై సన్మార్గంలో ఉంటే ఈపిల్ల అతనికి దక్కడంలో అసంభవం ఏమీలేదు.

శానయ్య—ఈపిల్లకి పైన ఓడు అధికారి పోగయ్యాడుగదా, శనిలాగ!

కమల—అదే పెద్దచిక్కు!

(నీలగిరి ఇవతలకొచ్చి వీళ్లని చూస్తాడు.)

శానయ్య—(తనలో) ఓరి, తెలివితక్కువా! పెద్ద దెయ్యంలాగ మమ్మల్ని ఘాటంగా ఎల్లాచూస్తున్నాడో, ఎడంగా ఏడవమంటేను!

కమల—అందుకని, నీవిప్పుడు ఏమిచెయ్యా లంటే......

నీలగిరి—(పూర్తిగా మధ్యకి వచ్చి) అయ్యా! త్రివిక్రమంగారు! క్షమించాలి, ఇతడు నానమ్మిన నౌఖరు. నా ఆజ్ఞచొప్పునే ఇతడు మీదగ్గిరకి వస్తా. నేనే ఇతణ్ణి పంపింది. (అని తనప్రజ్ఞకి తను నవ్వుకున్నట్టు నవ్వి) ఈ అమ్మాయిని గురించి మీతో మాట్లాడి, మీరు కోరి నడబ్బు మీకిస్తే, మీరు ఈపిల్లని ఇచ్చేస్తారేమో కను క్కురమ్మన్నాను.

శానయ్య—(తనలో) ఓరి, నీ మొహం తగ లెయ్యా!

త్రివిక్రమం—ఇదా, సంగతి! ఇందులో ఎవణ్ణి నమ్మడం? వీడోమాటా, వాడోమాటానూ!

శానయ్య—అయ్యా! తమరింకా ఎరగరుగా వును. ఈయనికి మతిలేదండి. తలకాయలోది రాగిడిమట్టి కూడా కాదు, ఉత్తచొడు. ఎరగరూ!

త్రివిక్రమం—ఎరుగుదునులే. నేను ఎరుగున్నది నేను ఎరుగుదును. మీరు ఎదో చేసేరకమే. (కమలతో) లోపలికిపో. ఇల్లాంటి సాహసపన్లు మరిచెయ్యకు.

(కమల ఎడమవేపుకి వెళుతుంది)

ఇక మీరు తుంటరిరకం! మరెప్పుడూ ఇల్లాంటి పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యకండి, కోదండం తీయించ గలను.

(ఎడమకి నిష్క్రమిస్తాడు.)

శానయ్య—మా బాగా జరిగింది. న్యాయానికి మనిద్దర్నీ మెత్తగా ఉతకవలిసింది పైపెచ్చు. నువ్వు అసలు రాకపోతే ఏంకొంపమునిగిపోయిందయ్యా! పైగా, లుడుంగుని చక్కావచ్చి నే చెప్పిందంతా అబద్ధం అంటావేమిటి, తెలివి మద్దెపు చవటమ్మలాగ!

నీలగిరి—నేను నిజం చెప్పాను, తప్పా?

శానయ్య—అబ్బో! చెప్పారు. ఇంతకంటె ఎక్కువ చేస్తారని ఎవడనుకున్నాడు. వప్పులో కాలె య్యడం పోటీలో తమరిదే బహుమతీ.

నీలగిరి—ఎదో కాస్త ప్రమాదం వచ్చింది. దానికి అంత బ్రహ్మాండం చేస్తావేమిటి? ఎల్లానో కమ్ముకోలేం అంటావా! బాబ్బాబు! నువ్వే ఎదో ఎత్తు లేవది య్యాలి. నేనుంటే వ్యాపారం పాడవుతుందేమో! కొప్ప డకుమరి. నేను పోతాను.

శానయ్య—మీరు చెయ్యగల వాటిల్లో అదే మంచిపని. ప్రస్తుతం.

(నీలగిరి కుడివేపుకి నిష్క్రమిస్తాడు. శానయ్య ఇటూ అటూ పచారు చేస్తూంటాడు. కుడివేపునించే పనసయ్య వస్తాడు)

శానయ్య—దణ్ణాలండి, పనసయ్య బాబుగారు!

పనసయ్య—మా నీలగిరి ఎడీ?

శానయ్య—నాకీవేళ కనిపించలేదండీ! అబ్బో! అబ్బాయిగారు సామాన్యులా!—...అయితే, బాబూ! మన పొలంలోంచి ఎవడో మనిషి వాడొచ్చాడు, తమకి కనపడ్డాడా?

పనసయ్య—ఎందుకొచ్చాడూ?

శానయ్య—పొలం తవ్వుతున్నారట. తవ్వుతూంటే, ఒకచోట, గునపాలు దిగడం మానేసి ఖంగు ఖంగున పైకి ఉబకడం మొదలెట్టాయిట! తీరాచూస్తే, డబ్బుతో నిండిఉన్న గంగాళాలుట.

పనసయ్య—సరేలే. ఎవ్వరితోనూ చెప్పకు.

(అని కుడివేపుకి పోతాడు)

శానయ్య—చిత్రం. (అని నవ్వుతూంటాడు)

2 వ ర ం గ ం

(కుడి వేపు వెనక నించి నీలగిరీ, ఎదరనించి శానయ్యా వస్తారు)

నీలగిరి—నేను ఓమంచి పనిచేశాను.

శానయ్య—చిత్తం. ఏమిటి ?

నీలగిరి—ఓ డబ్బుసంచీ దొరికింది. అది హంస రాజు పారేసుగున్నాట్ట. పట్టిగెళ్ళి ఇందాకా ఇచ్చేశాను.

శానయ్య—ఏడవలేక పోయారు పోదురూ! ఇందాకానే, నేనూ విన్నాను.

నీలగిరి—ఏమి పొగరుగా ఉంది నీకూ!

శానయ్య—కాదండీ! మీనాన్నా హంసరాజూ ఎప్పుడూకలిసి ఉంటారు. అందుకని హంసరాజుమీద ఎత్తునడపడానికి వీల్లేదు. ఇంతలో దైవాద్యా మీనాన్న విడిగాకనిపించాడు. అతణ్ని పక్కకి తప్పించాను. తర వాత, హంసరాజుని కలుసుగుని, వాణ్ని నిమ్మళంగా ప్రేమకబుర్లలో పడగొట్టి, వడుపుకనిపెట్టి, వాడి సంచీ లాగి పక్కనిపారేసి, వాణ్ని సాగనంపినపిదప అది తీసు కుని మనికి ఉపయోగించుకుందాం అని చచ్చి చెడితిని గదా, మీరు అది పుచ్చుగుని, "ఇదుగోనండోయ్" అంటూ ఎగడకపోతేం? పీటచెక్కలాగ ఏమూలో కూచోక!

నీలగిరి—అది నువ్వు తస్కరించి కిందపడేశావా? అరెరె, నాకు తెలియదే! (అని చిటికె వేస్తాడు)

శానయ్య—(తనుకూడా చిటికేసి, వెక్కిరించి, ఆడుతూ) అరెరె! నాకు తెలియదే! మీకు బుర్రపోతే తెలియదు. మీరు అన్నీ తగలపెడుతూంటే, నావల్ల కాదండీ!

నీలగిరి—నేను ఇకన్నించి చాలా జాగ్రత్తగా ఉంటాను! ఎరక్క అల్లా చేశాను. మరిచూడు నాప్రజ్ఞ! నువ్వు ఏదోపన్నాలి బాబ్బాబు (అని బతిమాలుకుంటాడు)

శానయ్య—సరే. ఉండండి. నాది అసలు మెత్తని మనస్సు. నమ్మినచోట సాయం చెయ్యకుండా ఆగలేను. శ్రమలేకుండా మీరు మూట ఒళ్లోపణ్ని స్తారా? అప్పుడే మరోయెత్తు వేసేశాను! మీరుమళ్లీ అవకతవకపని ఓటి చేస్తే మాత్రం మొదటికొస్తాం.

నీలగిరి—చఛ. ఈమాటుచూద్దూ......ఏమిటి యెత్తు?

శానయ్య— మీనాన్నగారు స్వర్గస్థులైనారనే వార్తవేసి పాకించి వచ్చాను—అకాత్తుగా ఒళ్లు కొయ్య బారి ఆవలించేశారని.

నీలగిరి—మానాన్న ఇంట్లో ఉండగానే!

శానయ్య—హంసరాజు సంచీలాగే మెత్తుకోసం పక్కకి తప్పించానని చెబుతూంటే వినరేం?

నీలగిరి—పక్కకి అంటే?

శానయ్య—పొలం పంపించాను. అక్కడ పని వాళ్లుతవ్వుతూంటే, కానుల్తోనిండిన గంగాళాలు గున పాలకి గోచరించాయి అని ఆయన్తో అనేసరికి ఆయన అక్కడికి పరుగూ! ఆయనేకాదు, ఊళ్లో సహంమంది అటుధౌడూ! ఇప్పుడు మనం మీనాన్నగారికి అంత్యక్రియలు జరిపేయత్నం చేస్తూన్నట్టు నటించాలి.

ఈ సంగతి హంసరాజుకికూడా చెప్పించాను. మీరు ఆచాటున నుంచోండి. నేను హంసరాజుని పిల్చి అతడితో మాట్లాడుతూంటాను. కొంతసేపటికి మీరు కూడారండి.

(నీలగిరి కుడిపక్క దాక్కుంటాడు)

శానయ్య—(ఎడమవేపుకి నడిచి) హంసరాజు గారూ!

హంసరాజు—ఆఁ (అంటూ, వస్తాడు)

శానయ్య—ఈవార్త వినేసరికి మీకు ఆశ్చర్యం వేసిపోయి ఉంటుంది.

హంసరాజు—అదే! విపరీతపు మరణం!

శానయ్య—ఆయనదే లోటు. ఇంత దారుణపు పనికి ఆయన్ని క్షమించకూడదు. నేను క్షమించను.

హంసరాజు—కాస్త తీసుగోడానికేనా ఆయనికి తీరుబడి లేకపోతే.

శానయ్య—మరణానికోసం ఇంత తొందరంటూ ఎక్కడా చూడలేదండీ.

హంసరాజు—పాపం నీలగిరి!

శానయ్య—ఆయన విచారంలో కేవలం మునిగి ఉన్నాడు. తలకాయ గోడకేసి కొట్టుకున్నాడు. తనుకూడా తండ్రితో పోతానంటాడు. తండ్రి విగ్రహం అతని కంటపడితే అతడు ఇంకా ఏమి ప్రమాదం తెస్తాడో అని అప్పుడే ఆశవాన్ని కట్టేశానండి.

హంసరాజు—అయ్యో పాపం! అప్పుడే ఎందుకు కట్టేశావ్ నేనింకా చూతాం అనుకున్నానే! పైగా ఒక వేళ ఇంకా జీవం ఉందేమో! ఇల్లాతొందరపడి కొందరు హత్యలుచేస్తూంటారు.

శానయ్య—ఆవిషయం నేను గారంటీగా చెప్తాను! అందుచేత, నీలగిరి తనతండ్రికి అంత్యక్రియలు శుబ్భరంగా చెయ్యదల్చుకున్నాడు. అతనిరాబడి మీాకు తెలిసిందే.

కాని, అతడు, ఇంకాఏదీ! కుర్రాడు. ఆ స్తిఅంతా కాకి తాలమీదేఉంది. అందుకని, తమర్ని ప్రార్థించి ఒక వెయ్యి పట్రమ్మని నన్ను పంపించాడు.

హంసరాజు—అవునవును.

(అని ఎడమవేపుకి వెడతాడు. శానయ్యకూడా వెంబడి స్తాడు. అప్పుడే వాళ్ళిద్దరూ వెనక్కివస్తారు. ఈలో పల నీలగిరి కుడివేపునించివచ్చి, ఎదరకూ చుసి, తలవంచుగుని, విచారం అభినయిస్తాడు)

హంసరాజు—ఊరుకో నీలగిరీ! మీనాన్నకి యె తలోవచ్చింది పాపం! పననయ్య మంచివాడేమరీ! అయి తేం, మృత్యువుకి మొహమాటం ఏమిటి? పొద్దున్న కల కల లాడుతూఉన్నాడు.

శానయ్య—అయితేనేమండీ! చిటికెలో జోలె డంత జరిగిపోతూంటుంది.

నీలగిరి—అయ్యో (అని ఏడుస్తాడు)

హంసరాజు—ఊరుకో వెర్రినీలం! ఇంతాచేసి, మీ నాన్నకూడా ఓమనిషేకదా! మృత్యువుని తప్పించు గుని ఎవడు బతగ్గలడూ!

నీలగిరి—అయ్యో!

హంసరాజు—మరోటి. మృత్యువు, నోటీసుకూడా లేకుండా, మనుష్యుల్ని లాక్కుపోతుంది. దానికి జాలేమిటి ?

నీలగిరి—నాయనోయ్ !

శానయ్య—మీ సమదాయింపు వ్యర్థం. ఇతణ్ని విచారం చుట్టబెట్టింది.

హంసరాజు—ఈ దుఃఖం పోదు, నాయనా. ఏదో కొంతవరకేనా మరిచిపో.

నీలగిరి—బాబోయి !

హంసరాజు—ఇదిగో. మీ నౌకరు చెప్పాడు, సొమ్ముకావాలని. ఈ డబ్బు తీసుకుని అంత్యక్రియలు శ్రద్ధగా చేసెయ్.

నీలగిరి—అయ్యో! అయ్యో!! నాయనో!!!

(అంటూ సొమ్ము అందుకుంటాడు)

శానయ్య—చూశారా ! ఆమాట అనేసరికి ఇతడికి విచారం వెయ్యిరెట్లు అవుతోంది.

హంసరాజు—లెక్కచూస్తే, మీకు నేను ఇంత ఇవ్వనక్కర్లేదేమో! అయితేం, నువ్వు ఇది కావలిసినంత వాడేసుకో. [పోతాడు)

నీలగిరి—అయ్యో !—(అని ఏడుస్తూ కుడివేపుకి

శానయ్య—మా యజమానికి ఎల్లాంటి దుఃఖం వచ్చిందండీ (అని ఏడవబోతాడు)

హంసరాజు—శానయ్యా! కాస్త రశీదుముక్క నాకిప్పిస్తే బాగుండును.

శానయ్య—(వినిపించుకోకుండా) ఒక్కడే కొడుకుగూడాను.

హంసరాజు—ప్రపంచంలో ఏదీ నమ్మేటందుకు వీల్లేదు.

శానయ్య—అయ్యో ఉండండీ

హంసరాజు—కాస్త ముక్క రాయించు.

శానయ్య—ఆయన ఇంతవిచారంలో యెల్లా రాస్తారూ?

ఆయన కాస్త స్థాయీ పడడం — తడువుగా మీకు రశీదు తెస్తాను. సెలవు. నాకు కూడా గుండె కరిగిపోతోంది. వెళ్ళి, అతణ్ని కలుసుగుని, పూర్తిగా రాగాలెడితేగాని, తోచటం లేదు.

(అని కుడివేపుకి పోతాడు)

హంసరాజు—ఈ ప్రపంచంలో అన్నీ చిక్కులే.
(అని ఎడమవేపుకి వెళ్ళిపోతూండగా పనసయ్య వస్తాడు)

హంసరాజు—(కుడివేపుకి జరిగి)—చచ్చాన్రా దేవుడా? దడపుడుతోంది! ఏమిటి! పనసయ్య మళ్లీ బతికాడేం? (గుటక వేసి) బాబోయి! ఇతని ఆత్మకి శాంతి చాలలేదా యేమిటి చెప్మా! పోయింతరువాత పాపం ఎంత చిక్కాడో! కళ్లు గుంటలు పడ్డాయి! నామీాదకి రాకు!

పనసయ్య—అల్లా అనవసరంగా భయపడిపోతున్నా వేం?

హంసరాజు—నువ్వు, కొంతదూరాన్ని ఆగి, ఎందుకొచ్చావో చెప్పు. నాదగ్గిర సెలవుపుచ్చుగోడాని కే ఇంత శ్రమ పడ్డానంటూ వా, నాకు అంతగౌరవం అనవసరం! నీజీవుడికి శాంతి చాలకపోతే, శాంతి చెయిస్తాను. నన్ను మాత్రం ఇక భయపెట్టకు.

పనసయ్య—నాకెంతకోపం వచ్చినా, నవ్వుకూడా వస్తోంది.

హంసరాజు—అయ్యో, ఏమిచోద్యం. చచ్చినవాడికి నవ్వుకుడా ఏమిటి?

పనసయ్య—ఇదేం హాస్యమా? లేక నీకు పిచ్చి పట్టిందా? బతుకున్నవాళ్ళని చచ్చినట్టు కడుతున్నావేం?

హంసరాజు—ఇప్పుడేగా నిన్ను కట్టేసింది?

పనసయ్య—నాకు తెలియకుండా నే నెల్లా పోయానుచెప్మా.

హంసరాజు—శానయ్య నీమరణవార్త చెప్పగానే నాకు మరణం అంతపని జరిగింది.

పనసయ్య—నీకు ఇప్పుడు మెలుకువా, నిద్రా? నువ్వు నిజంగానే చన్నారగవ్?

హంసరాజు—నీశరీరం వెనకటికిమల్లేనే ఉంది. కాని ఎప్పుడు ఎల్లమారుతుందో! నువ్వు లావెక్కావు, మొహం చూస్తే భయంవేస్తోంది. నన్ను ఇంతటితో వదిలిపెట్టు.

పనసయ్య—మరో అప్పుడు దీనికంతకీ నేనూ నవ్వేసిఉందును. నామరణవార్త ఒకటీ, నాపొలంలో ధనం దొరికిందన్న వార్త ఒకటీ, ఈరెండూకుడా ఆ శానయ్య పీనుగు కల్పించాడు. వాడు తుచ్ఛుడు, నీచుడు, లుచ్ఛా! పరమలుచ్ఛా యెందుకేనా తగును.

హంసరాజు—అల్లాయితే నాకు టోపీవేశాడంటావా! పోనీ ముట్టుగుచూద్దాం. (ముట్టుగుని) పాపం పనసయ్యే! ఒరి నామతిమండిపోనూ! ఈ సంగతి ఎవరితోటీ అనకుస్మీ, ఎదేనా ప్రహసనం రాయగల్రు నామీద! కాని, పనసయ్యోయ్! నాదగ్గిర వాళ్లిద్దరూ ఒక వెయ్యి పట్టిగెళ్ళారు, నిన్ను పాతేసి నీకు అంత్యక్రియలు జరపడానికంటూ!

పనసయ్య—అదీ కిటుకు! నీకర్మం! ఆడబ్బునం గతి నాకు తెలియదు. నేవెళ్ళి ఈశానయ్యమీద రిపోర్టు ఇచ్చి, వాడుదొరికితే, ఎంతడబ్బైనాసరే ఉరి తీయించే స్తాను.

(అని ఎడమవేపుకి వెడతాడు)

హంసరాజు—(ఒక్కడూ) ఎంతమూర్ఖుణ్ని! తుం టరిపీనుగులమాటలునమ్మి, ఒక్కపూటలో చూస్తూండ గా బుద్ధీ డబ్బూకుడా నష్టపోయాను. ఇక నడవచ్చు.

(అని కుడివేపుకివెళ్ళబోతూండగా నీలగిరి వస్తాడు)

ఆఁ! నీలగిరి ఇల్లా వస్తున్నాడు.

(ఆలోచిస్తూ పచారు చేస్తాడు)

నీలగిరి—(ప్రవేశించి) ఇకఇదెట్టి ఆపిల్లని కొనె య్యడమే (అనుకుంటాడు)

హంసరాజు—(అతిదీనంగా) ఏంనాయనా! విచా రం కొంత తగ్గించుకున్నావా?

నీలగిరి—(ఇవుడు మొహం ఇంకా విచారంగా పెట్టి) ఎల్లా తగ్గుతుందీ! (అని చీదాలి)

హంసరాజు—పోయినవాళ్ళు మళ్ళీరారు! నువ్వు అల్లానే కాస్త బండకెత్తి తిరగాలి. అయితే, చూడూ, ఓమాట చెప్పాలనుకున్నాను, ఇందాకా నీకిచ్చినడబ్బులో

కొన్ని మారనినాణాలు ఉన్నాయి. తొందర్లో అల్లా ఇచ్చేశాను మంచివి ఇప్పుడు తెచ్చాను. ఈ కాలంలో ఎక్కడచూసినా ఫోర్జరీలే, దిక్కుమాలింది. అందుకని అనుమానించకుండా డబ్బు తీసుకోడం భయంగా ఉంది.

నీలగిరి—మారనిసరుకు నాకేమీ కనిపించలేదే?

హంసరాజు—నువ్వు కుర్రాడవు, నీకేం తెలుసూ, నాకు తెలియాలిగానీ! [చండి.

నీలగిరి—అయితే ఇదిగో మూట. పిరాయిం

హంసరాజు—అన్నీ యింతే?

నీలగిరి—ఇంతే!

హంసరాజు—అయితే సరే. అమ్మయ్యా. (అని డబ్బు దాచుగుని) మరి దయచెయ్యి! లుచ్ఛావేషాలేస్తావ్ నాదగ్గిరా! రాయల్లా ఉన్నమనిషిని పట్టుగుని పోయాడంటావు? తండ్రికే ఇంతచేసినవాడవు, నేను పిల్లనిచ్చి మామగారైతే, నన్నేం చేద్దువో! నీకు పిల్లని ఇవ్వవలసిందే? సిగ్గుబిడియాలు వద్దూ! నడునడు.

(అని కుడివేపుకి పోతాడు)

నీలగిరి—(తెల్లబోయి) అప్పిడే ఎల్లాపట్టుకున్నాడు నన్ను వీడూ.

(ఎడమవేపునించి నవ్వుతూ శానయ్య వస్తాడు)

శానయ్య—మనది, ఏం అదృష్టం అండీ! ఎవరు నెగ్గగల్రు ఇల్లా? ఆరుసార్లు పురుషత్తు ఇచ్చాను ఎవ ణ్నైనా నెగ్గమను! కమలని కొనుక్కొస్తాను, ఏదీడబ్బు!

నీలగిరి—(దీనంగా) శానయ్యా! చక్రం తిరిగి పోయింది.

శానయ్య—సంగతేమిటి?

నీలగిరి—హంసరాజు, ఆమూటలో కొన్నిపూటాలూ, కరోడాలూ ఉన్నాయి, పిరాయిస్తాను, మూట తెమ్మని కొట్టేశాడు.

శానయ్య—హాస్యమా?

నీలగిరి—నిజమే!

శానయ్య—ఒట్టు!

నీలగిరి—ఒట్టు నాకు భయంగానే ఉంది, నీకు కోపం వస్తుందని.

శానయ్య—నాకు కోపం ఎందుకూ! కమల ఖైదులో ఉండనీ, మాననీ, చంద్రుడువెళ్ళి కమలని కొనుక్కోనీ మాననీ నాకెందు కీగోల.

నీలగిరి—అప్పిడే అంత విరక్తిగా మాట్లాడితే ఎల్లాగోయ్? కాస్త్రప్రమాదం చివర్నైగా వచ్చింది నావల్లా? ఇది మినహాయిస్తే, నేను ఏడుపుపార్టు బాగా అభినయించలేదూ?

శానయ్య—అందుకనే మీరు స్వంతఖర్చుమీద ఓ మెడలు చెయించుగోండి.

నీలగిరి—సరేనోయి! తప్పునాది. మరి నువ్వు సాయం చెయ్యకపోతే ఎల్లా?

శానయ్య—విధేయుణ్ని. నాకు తీరుబడిలేదు.

నీలగిరి—బాబ్బాబు! బతిమాలుతున్నాను.

శానయ్య—నేను వినిపించుగోను.

నీలగిరి—నువ్వు కనికరించకపోతే, నేను చచ్చిపోవాలి.

శానయ్య—మహరాజులా!

నీలగిరి—కత్తి తీస్తా!

శానయ్య—దివ్యంగా.

నీలగిరి—సెలవ్. దయుంచు. శానయ్యా!

శానయ్య—సెలవు. దయఉంచండి, నీలగిరిగారు!

నీలగిరి—నిజమే?

శానయ్య—ఇంకా చూస్తారేం?

నీలగిరి—నే పొడిచేసుగుంటే నాబట్టలు లాగ వచ్చుననా?

శానయ్య—ఇదంతా నటనే అని నాకు తెలియదనా? సరే, నడవండి!

3 వ రంగం

[నల్లటికోటూ, తలకి ఎఱ్ఱగళ్ళ రుమాలూ, కాలికి కడియం ధరించుగుని మన్యపు వర్తకుడు వేషంలో నీలగిరి కుడివేపునించి వస్తాడు. శానయ్య వెనకాలే వస్తాడు.]

శానయ్య—ఈ వేషంలో మీరు బాగానే ఉన్నారు.

నీలగిరి—ఈ కొత్త పన్నాగంతో నాకు కొంత ఆధారం కలిగించావు, నీ ధర్మమా అని.

శానయ్య—నా కోపం ఎప్పుడూ అంతే. బుస్సుమంటుంది. అప్పుడు ధాం ధూం అంటాను. అల్లాఅంటే ఎంతో అనక పోయినా అంతే అసలు.

నీలగిరి—నేను నీ మేలు మరుస్తానా ?

శానయ్య—దానికేం లెండి గాని, ఈ సారిగనక మీరు ఏదేనా ప్రమాదం తెస్తే, దాన్తో ఆఖరు. మీ వేషానికి కావలసిన ముక్కలు కంఠతా వచ్చాయా, ఇప్పటికేనా ?

నీలగిరి—వచ్చాయిగాని, నువ్వు త్రివిక్రమంగాణ్ణి ఎల్లా దువ్వావు ? ఎల్లా బుట్టలో వేశావ్ ?

శానయ్య—ఏదో తంటాలు పడ్డాను. అతని ఘోషంతా నాదే అయినట్టు మాట్లాడాను. అతనికి

శత్రువులు బయల్దేరి కుట్ర చేస్తున్నారన్నాను. నన్ను అందులో చేరమంటే చేరనని చెప్పానన్నాను. రోజులు మంచివికావన్నాను. వెధవపన్లంటే నాకు మంటన్నాను. నా డబ్బూ దస్కం భూమి వత్తూ అతని దగ్గరే దాచుకుంటానన్నాను. దాన్తోటి లొంగాడు. తన గతించిన కొడుకు ఎల్లానో బతికినట్టూ, వాణ్ణి తను చూసినట్టూ తనకి రాత్రి కలొచ్చిందట, ఆ కథంతా చెప్పాడు. ఆ కథని బట్టే ప్రస్తుతం మనం ఈ వేషం వేస్తూంట. [గా!

నీలగిరి—నాకు తెలుసు లేస్తూ, ఇందాకా చెప్పిందే!

శానయ్య—తమతో ఎన్నిమాట్లు చెబితేం, ఏ చిన్న అంశంలోనో దూడేసి ఊరుకుంటారు.

నీలగిరి—అబ్బ, ఇకనడూ! ఈ వేషంలో ఎంత సేపని ఉండడం ?

శానయ్య—ఎక్కడా మరీ దురుసుగా వెళ్ళకూడదు. వెడితే ఎదురు దెబ్బలు తగుల్తాయి. తమ తల గట్టిది. ఏ సంగతీ అందులో ప్రవేశించదు; మేకు కూడా దిగదు. అందుకని మళ్లీ వినండి.

నీలగిరి—నీ కింత చాదస్తం పట్టుకుందేం ?

శానయ్య—చిత్తం. వినండి. మన పన్నాగ ప్రకారం, త్రివిక్రమం వెనకటి పేరు గణపతి. అతడు మ

న్యంలో సువర్ణదేశంలో వజ్రపురంలో మకాం. అక్కడ ఏదో రాజద్రోహం చేసి, పట్టుకుంటారని రాత్రికి రాత్రి ఇక్కడికి లేచొచ్చాడు. ఆ వచ్చే టప్పుడు పెళ్ళాన్నీ, కొడుకునీ, కూతుర్నీ వొదిలేసివచ్చాడు. వచ్చిన కొద్ది రోజులకే భార్యా, పిల్లా, తప్పిపోయినట్టు తెలిసింది. ఎన్నాళ్ళకీ వాళ్ళు రాలేదు. అల్లాంటి విచారంలో కొడుకుని దగ్గిర ఉంచుకొని భరించలేక, సింహాపురం ఉత్తరం రాసి, ఆ పసిబాలుణ్ణి అక్కడ చదువుకి పెట్టాడు. ఇది జరిగి ఇప్పటికి 15 ఏళ్లు అయింది. ఇదీ అతని కథ!—ఇక మన సంగతి! మీరు సువర్ణదేశపు వర్తకులు. ఆయన కొడుకుని తమరు చూసినట్టూ, ఎరిగి ఉన్నట్టూ, ఇప్పుడు నాటకం ఆడాలి. ఆయన భార్యనీ కూతుర్నీ కుడా బానిస స్థితిలోంచి తమరు డబ్బోసి విడిపించినట్లు చెప్పాలి. మరి మీ కూడా ఎందుకు తీసుకు రాలేదంటే, తొందర పనిమీద ముందు నే వచ్చేశాను, నా వెనకాలే వాళ్ళు బయల్దేరుతారు, అని చెప్పాలి. ఇప్పుడేనా పాఠం బాగా తెలిసిందా? ఏదో దిక్కుమాలి జవాబుచెప్పి మళ్ళీ నాకు పీకలమీదికి తెస్తారా?

నీలగిరి—ఇన్ని మాట్లు చెప్పడం శుక్కుదండగ! నాకు మొదటిసారే తెలిసి పోయింది.

శానయ్య—అల్లాయితే నే వెళ్ళి ఉపక్రమిస్తాను.

నీలగిరి—మాట మాట! ఆయన కొడుకు ఎల్లా ఉంటాడో వర్ణించమని ఆయన అడిగితే?

శానయ్య—కష్టమేమరీ! కాని ఒక సంగతిలెండి. ఆ అబ్బాయి చిన్నప్పటికి మల్లేనే కూచున్నాడా ఏమిటి మారకుండా? ఎదో బాగానే ఉన్నట్టు వర్ణించుగుపొండి.

నీలగిరి—అల్లానే! అయితే, నన్ను ఒక వేళ ముసిలాడు ఆనవాలు పట్టి పోల్చేస్తే!

శానయ్య—ఈ సంగతీ చెప్పానుగా! మీ జ్ఞాపకం ఏడిసినట్టే ఉంచండి! మిమ్మల్ని ఒక్కమాటేగా, అతడు చూసిందీ! పైగా, ఈ గడ్డం, వేషం ఇవన్నీ ఉన్నమీదట, నేనే మిమ్మన్ని పోల్చుగోలేక పోతున్నాను, ముసిలాడి వశమా?

నీలగిరి—అవును, నిజమే. కాని, సువర్ణదేశంలో, ఏభాగంలో?

శానయ్య—అబ్బ! చివరకి మీరు అంతా తగలేస్తారు!— పశ్చిమభాగంలో.

నీలగిరి—ఆ ఊరుపేరు ఏమిటంటే?

శానయ్య—ఇది నెగ్గే వ్యాపారం కాదు. బండాపురం! నన్ను ఈయన కదలనీయడు. అంతా వచ్చునం

టాడు. ఊరుపేరేనా జ్ఞాపకం లేదు, డజనుసార్లు చెప్పిన మీదట!

నీలగిరి—సరే. రెడీ, నడు.

శానయ్య—ఈ మాటేనా సజావుగా ఉండండి. మీ స్వంత పైత్యం ఇందులో కలపకండి.

నీలగిరి—అబ్బ, ఊరుకో, ఎప్పుడూ నీకు అపనమ్మకమే.

శానయ్య—జాగ్రత్త! ఆ అబ్బాయి పేరు, ప్రసాదు—చదువు సింహపురంలో—గురువు రామోజీ—త్రివిక్రమం వెనకటి పేరు గణపతి.

నీలగిరి—ఏమిటదీ! నేనక్కడికి వాజమ్మననా, చవటననా?

శా—ఆఁ, వాళ్లకి చేరుపేమో అని.

(శానయ్య ఎడమపక్కకి నడిచి, త్రివిక్రమంగారిని పిలుస్తాడు. త్రివిక్రమం వస్తాడు)

శానయ్య—వీరేనండి, నేను తమతో చెప్పిన వర్తకులు.

త్రివిక్రమం—మంచిది. నాకు తిరిగి మంచి రోజులు రావడానికి కారణం దేవుని దయ.

శానయ్య—మీరు కలగన్నారు, సామాన్యులా! కలలు అబద్ధం అనేవాళ్లని ఇప్పుడు ఎంజెయ్యాలి?

త్రివిక్రమం—(నీలగిరితో) అయ్యా! మీ ఋణం నేనెట్లా తీర్చుకోగలను? నాకు శుభవర్తమానం చెప్పడానికి వచ్చిన దేవదూతకి నే నేమి ప్రత్యుపకారం చెయ్యగల్ను?

నీలగిరి—స్తోత్రాలు అనవసరం.

త్రివిక్రమం—(శానయ్యతో) ఈ సువర్ణదేశస్థుడులాంటి వాణ్ణి ఎక్కడోగాని చూశానయ్యా, శానయ్యా! జ్ఞాపకం చాలకుండా ఉందీ!

శానయ్య—నేనూ ఇప్పుడు ఆమాటే మీతో అనాలీ అనుకుంటూంటే మీరే అనేశారు. మనిషిని పోలిన మనిషి ఉంటూంటాడు.

త్రివిక్రమం—అల్లాయితే, మాకుర్రాడు మీకు కనిపించాడూ?

నీలగిరి—చిత్తం. కనిపించాడండి, త్రివిక్రమంగారు.

త్రివిక్రమం—తన సంగతి మీతో చెప్పుగుని, నన్ను గురించి కూడా మీదగ్గిర ముచ్చటించాడేం?

నీలగిరి—ఆహా! ఓ లక్షసార్లు మిమ్మల్ని వర్ణించాడు.

శానయ్య—(నీలగిరితో) అబ్బ! అన్నిసార్లెందుకూ? కొన్ని తగ్గించకూడదూ!

నీలగిరి—మీ రిప్పుడు సరిగ్గా ఎల్లా ఉన్నారో అల్లా, విగ్రహం, మొహం, రీతి, అచ్ఛంగా ఇల్లానే వర్ణించాడు.

త్రివిక్రమం—(అనుమానిస్తూ) అప్పటికి వాడికి ఆరేళ్ల వయస్సుగదా, ఎల్లా వర్ణించగలిగాడు నన్నూ?

శానయ్య—పేగు సంబంధం గనక మీ విగ్రహం యొక్క ఛాయ ఆ కుర్రాడి హృదయంమీాద అల్లా ముద్ర కొట్టినట్టు ఉండిపోతుంది.

త్రివిక్రమం—సరే చాలు. ఆ అబ్బాయి ఎక్కడ ఉండగా వొదిలిపెట్టి వచ్చారు మీారూ?

నీలగిరి—వంటాపురం!

త్రివిక్రమం—ఆ దేశంలో ఈ పేరే వినలేదేం?

శానయ్య—(తనలో) హారి, త్యాష్టం! (త్రివిక్రమంతో) తమకు తెలియలేదు గావును. అతని ఊహ "బండాపురం". "బ" అన్నా "వ" అన్నా ఒకటే కాదూ! అదీ! "డ" అనే అక్షరమే కటువుగా పలికితే "ట" అవుతుంది.

త్రివిక్రమం—అదా! నాకు చెవితేగాని తెలియలేదుస్మీ. "మానాన్న ఫలానా ఊళ్లో ఉన్నాడు, మీారు వెళ్లి కలుసుకోండి" అని మీాతో అన్నాడా, మావాడు?

శానయ్య—(తనలో) సమాధానం చెప్పకుండా దిమ్మలా నుంచున్నాడు. (చేతులు తిప్పి నీలగిరికి కొన్ని సంజ్ఞలుచేసి, ఆసంగతి త్రివిక్రమం కనిపెడుతూన్నట్టు గ్రహించి, చెడీతో చెయ్యితిప్పుతూన్నట్టు అభినయించి) చిన్నప్పటి చెడీ జ్ఞాపకం వచ్చింది. అప్పుడు చెడీలో నే ఎరుగున్నంతవరకు, నాకు చాలిన చెయ్యిలేదు. అందు కని, చెడీరంగంలోకి దూకేటప్పుడు అందరూ నాకు మొక్కి మరీ వెళ్లేవారు. నా బహుమతులు చాలాభాగం చెడీవే.

త్రివిక్రమం—అప్పటి నీ చెడీసంగతీ, ఇప్పుడు నా కెందుకులే! (నీలగిరితో) నాకు అప్పట్లో ఏంపేరని అన్నాడు, మా అబ్బాయి, మీతో ?

శానయ్య—(రాగధోరణిగా) గణాపతీగ అలల ఆరు, దేవునికి మీాయందు ఎంతదయ !

నీలగిరి—అదీ, మీా పేరు. ఇప్పటిది అరువుపేరు.

త్రివిక్రమం—అయితే, తను ఏడూళ్లో పుట్టినట్టు చెప్పాడు, మావాడూ ?

శానయ్య—వజ్రపురం మంచిదేగాని, కొన్నాళ్లకి విసుగుపుట్టచ్చు ! [ఏక లొడలొడా !

త్రివిక్రమం—అబ్బా, ఏమిటయ్యా ! చెవికింద

నీలగిరి—అతను పుట్టింది వజ్రపురంలో.

త్రివిక్రమం—చిన్నప్పుడు చదువుకి అతణ్ణి ఎక్క-డికి పంపించా నన్నాడు ?

శానయ్య—(గుండె బాదుకుని) పాపం! ఆగురు వున్నాడు, చూశారూ, రామోజీ!—సింహపురం కాపు రస్తుడు—అతడు మీా అబ్బాయికోసం ఎంత పాటుపడి ఉంటాడో!

త్రివిక్రమం—ఊరుకోమంటే!

శానయ్య—(తనలో) ఈ సంభాషణ ఇంకా సేపు జరిగితే, కొంప గుండమే.

త్రివిక్రమం—ఇంకా వాళ్ల వృత్తాంతం చెప్పండి!

శానయ్య—(ఆవలించి) ఈవేళ నా కిదేమిటో గాని, ఏక ఆవలింతలు! (అని చిటికేస్తూ) అయ్యా! త్రివిక్రమంగారు! వారు పాపం ఇప్పుడే వచ్చారు. కాస్త ఫలారం అయింతరువాత మళ్లీ కనుక్కుందాం.

నీలగిరి—నాకు ఏమీా ఫలారం అక్కరలేదు.

శానయ్య—ఎంతమంచి వాడవయ్యా! వెట్టి వాడా! నీ ఆకలే నువ్వెరగవ్!

త్రివిక్రమం—లోపలికి రండీ, అల్లాయితే.

(అని వాళ్లిద్దర్నీ ఎడమవేపుకి తీసుకుపోతాడు)

4 వ రం గం

[ఎడమ వేపునించి శానయ్యా, నీలగిరీ కాఫీ వగై రాలుస్వీకరించి వస్తూన్నట్టు వస్తారు.)

శానయ్య—ఇల్లాంటి దారుణ ప్రమాదాలు చేస్తూంటే మన పన్నాగం వీధిని బడుతుంది.

నీలగిరి—ఏముటోయ్, అ స్తమానం, వెధవకోప్పడ్డం నువ్వూనూ! ఏమిటి నువ్వు తగాదా పెట్టేదీ? ఈ వేషం అంతా నేను మెడల్సు పొందేటట్టు అభినయించ లేదూ?

శానయ్య—మాటల్లో అవకతవక పోనీ సర్దుకు ఏడిచాననుకోండి. చేష్టల్లోనూ అంతే? ఎంత ప్రేమవుంటే మట్టుకు! గుంభన అక్కర్లేదూ?

నీలగిరి—నా అంత గుంభనగా ఎవ్వడూ ఉండలేడు. నేను కమలతో మాట్లాడం దే?

శానయ్య—మాట్లాడకపోతేనరా? కాఫీ తాగి వచ్చిన కాస్సేపట్లోనూ, సంవత్సరంలో కలిగించవలిసిన అనుమానాలు కలిగించేశారు.

నీలగిరి—ఏం జేశానమ్మా?

శానయ్య—(వెక్కిరిస్తూ) ఏం జేశానమ్మా! ఏం జేశారో ప్రతీవాళ్లకీ తెలిసింది. బల్లదగ్గిరికి కమలవచ్చి

కూర్చున్నది లగాయతూ రెప్ప వెయ్యకుండా ఆపిల్లని చూడడమే. కడంవాళ్ళ మాటలు మీరు వినిపించుకోనే లేదు. ఆ అమ్మాయికి దాహమైతే, మీరు తాగడం—ఆగ్లాసే తోలవకుండా పుచ్చుకని. ఆపిల్ల ఏదేనా ఏరి పారేస్తే, అది మీ ప్లేటులో వేసుకున్నారు. సరి, బల్ల కింద మీ కాళ్లు ఊరుకున్నాయా? మీ పాదం పెట్టి ఆపిల్ల పాదం తొక్కారు. తొక్కడంలో పరాధ్యానంగా, ఆ ముసిలాడి పాదం మూడుసార్లు అదిమారు. ఆయన, ఏమిటో తెలియక, కుక్కల్ని చచ్చేట్టు కొట్టించాడు. ఇవేనా, అక్కడ చెయ్యవలిసిన చేష్టలూ? నాకు చెమటట్టి, చచ్చినంతపనిజరిగి, ఇవతల ఎప్పుడు పడుదునాఅని కూర్చున్నాను.

నీలగిరి—సరే. నవ్వు ఇంతగా గోలెడుతున్నావు గనక, ఇకముందు ముందు జాగ్రతగా ఉంటాను, చూడు.

శానయ్య—పోదురూ! మీరు జాగ్రతగా ఉంటారు, నేచూస్తాను. రొండూ నిజమే!

(ఎడమవేపునించి త్రివిక్రమం వస్తాడు.)

త్రివిక్రమం—(వచ్చి) రహస్యమా?

శానయ్య—అబెబ్బే! మీకుర్రాడి వయినమే మాట్లాడుతున్నామండీ!

త్రివిక్రమం—మీకు దయఉండబట్టి! (నీలగిరితో) వీరితో రెండు ముక్కలు మాటాడాలి, సెలవా?

నీలగిరి—సరే

(త్రివిక్రమం శానయ్యని ఎడమవేపు ఎదటికి తీసుగొస్తాడు) [చ్చానో తెలుసా?

త్రివిక్రమం—నేను లోపలికి ఎందుకు వెళ్లా

శానయ్య— తెలియదు, చెప్పండి.

త్రివిక్రమం—మాదొడ్లో, చెట్టు ఓటుంది, తాతల్నాటిది. దానికొమ్మ ఒకటి కొట్టి దాల్లోంచి (అభినయిస్తూ) ఇంత లావుకర్ర చెక్కాను. దాంతో ఇద్దర్ని వీపుమీద ఉతకాలి. అదిచాలా అందంగా. ముళ్లు ముళ్లుగా, బరువుగాఉంది.

శానయ్య—(కొంచెకొంచెం నవ్వుతూ) ఇంత శ్రమా ఎవరినిమిత్తం?

త్రివిక్రమం—ముందు, నీనిమిత్తం. తరవాత, ఈవర్తకుడి వేషంలోవచ్చినవాడి నిమిత్తం.

శానయ్య—(దీనంగా మొహంపెట్టి) ఏమిటి? వాడు వర్తకుడు కానేకాడూ?

త్రివిక్రమం—ఛీ, నోరుముయ్! వాడేఅన్నాట్ట!—కమలదగ్గిర సెలవు పుచ్చుగుంటూ—చుట్టుపట్ల ఎవరూ

విసరనుకుని—"కమలకోసమే వేషంలోవచ్చాను" అని చెప్పాడట, మాదాసీది వింది.

శానయ్య—చూశారా, ఎల్లావచ్చిందో! ఈ మాటే నిజం అయితే, వాడుముందు నన్నుదగాచేశాడన్న మాట.

త్రివిక్రమం—ఆమాట ఋజువుచెయ్యి! వాణ్ణి చావగొడదాం! రా!

శానయ్య—రండి మరి!...(తనలో) ప్రతీదీ తగలపెడుతూంటే, ఇదే బహుమతీ!

(ఇద్దరూ చెరో కర్రా పుచ్చుగుని, నీలగిరి వేపు వెడతారు.)

త్రివిక్రమం—ఇదేనా పెద్దమనిషితరహా! వేషాలేసి మర్యాదస్తుల్ని వేళాకోళం చేస్తావ్?

శానయ్య—వాళ్లబ్బాయిని చూశా నంటావ్, ఎల్లాగో ఇంట్లో ప్రవేశించడానికి? [తక్షణం!

త్రివిక్రమం—(నీలగిరిని కొట్టి) అవతలికి పో

శానయ్య—(తనుకూడా నీలగిరినికొట్టి) ఇంకా పోవేంరా? అల్లాచూస్తావేం? శనిలాగ?

నీలగిరి—(శానయ్యకేసితిరిగి) అయ్యో! అయ్యో! ఓరిలుచ్చా!

శానయ్య—దగాచేస్తే ఇంతేశాస్తి!

నీలగిరి—ఓరి శుంఠా! పెద్దమనిషిని ఇల్లా!...

శానయ్య—పో పో! లేకపోతే నిన్నిప్పుడు కొట్టా నంటే మళ్ళీ... వెళ్లాలి...

త్రివిక్రమం—(శానయ్యతో) చాల్లే! ఆగు! ఇప్పుడునాకు నచ్చింది. నువ్వు లోపలికిరా.

(అని ఎడమకి వెడతాడు.)

శానయ్య—వీణ్ణి ఇంకా కొంతదూరం కొట్టివసాను. పదండి.

(కుడివేపు చివరదాకా నీలగిరిని తరిమినట్టు నటించి)

శానయ్య—ఓమాట అడుగుతాను కోపంరాదు కద! వీపు ఎల్లావున్నట్టు!

నీలగిరి—ఛీ! తుంటరిపీనుగా! మాటాడొచ్చావ్, పైగాను!

శానయ్య—నాకు మీమీద కోపం పోయింది.

నీలగిరి—నీకు రెట్టుకిరెట్టు బాకీ తీరుస్తాలే!

శానయ్య—ఇదంతా మీరే చేతులారా చేసుగున్నారు.

నీలగిరి—నేనా?

శానయ్య—అవును. కమలతో మీరు వాగే టప్పుడు త్రివిక్రమంగారి దాసీది, సంగతిఅంతా విందట!

నీలగిరి—పోనీ అదినాఖర్మం! నీచేత దెబ్బల ప్రాలుబ్ధం ఏమిటి నాకు?

శానయ్య—నన్నేంజెయ్యమన్నారు? అల్లాచేస్తే గాని, అనుమానం నామీంచి తప్పించుకోలేక పోయాను నేను.

నీలగిరి—పోనీ, అల్లాంటప్పుడు నువ్వు నన్ను నిమ్మళంగానేనా కొట్టకూడదూ?

శానయ్య—ఆ త్రివిక్రమంగారు నాదగ్గిరే ఉండి చూస్తూంటే నిమ్మళంగా ఎల్లాకొట్టడం? నాబుర్ర తీసెయ్యడూ? అదీగాక, మీరుచేసిన అభావచేష్టల్లో నేపడ్డ పాట్లకి తమకి బహుమతీ ఇవ్వడానికి నాకుదొరికిన అదను ఇదేగదా, నన్నెల్లా ఊరుకోమన్నారూ? క్రియ ముక్క, అయిందేదో అయింది. నామీద మీరు కసి మానుకుంటే, నేను మరో ఉపాయం చెబుతాను. ఈపా టికి మీరు ఆగడ్డం తీసెయ్యండి.

(ఎడమవేపునించి, పనసయ్యా, హంసరాజూ వస్తారు. వస్తూ. ఒకరిముఖం ఒకరు చూసుగుని నవ్వు కుంటారు)

పనసయ్య—ఎవరది? ఓరీ! నీలగిరి! ఆవేషం ఏమిటి? వీడితో వద్దంటే నువ్వు మానవేం?

శాస్త్రయ్య—ఇదేమిటండీ మధ్యా! కమలమ్మ గారి కోసం ఈయన వేషంమీద వెడితే, త్రివిక్రమంగారు ఈయనకి బాగా దేహశుద్ధి చేశారు. కావలిస్తే పిలిచి కనుక్కోండి, నాకు తెలియదు.

పనసయ్య—నిజమే?

శాస్త్రయ్య—ఒట్టండీ!

పనసయ్య—అల్లాయితే ఉండు. త్రివిక్రమం! ఇల్లారా!

(ఎడమవేపు నించి త్రివిక్రమం వస్తాడు)

త్రివిక్రమం—పనసయ్యా! (హంసరాజుకేసి చూసి) ఇదిగో! ఏమిటి విశేషాలు!

పనసయ్య—నేనూ హంసరాజూ బజారెళ్లాం. అక్కడిసంగతి చెప్పవోయ్!

హంసరాజు—ఇద్దరు కోయవాళ్లు—ఆడవాళ్లు—ఒకళ్లని ఒకళ్లు దుమ్మెత్తిపోసుకుంటున్నారు. వాళ్లది మన్యంట. అందులో ఒకర్తె, "గణపతిగారి పిల్లని నేను పెంచుకుంటూఉంటే, నువ్వు తస్కరించి, ఎక్కడో అమ్మేశావుట" అని రెండోదాన్ని తిట్టింది. తరవాత

వాళ్లు కలియబడి, ఒకర్ని ఒకరు రక్తప్రవాహాలయ్యే ట్టు రక్కుకుని చావుకి సిద్ధం అయారు.

పనసయ్య—దాన్ని బట్టి ఈకమల నీకూతు రే అని మేం స్థిరపర్చుకున్నాం.

త్రివిక్రమం—(అతి సంతోషంతో) నిజమే! నిజమే! అమ్మా!

(ఎడమ వేపునించి కమలవస్తుంది)

త్రివిక్రమం—తల్లీ!

కమల—నాయనా!

త్రివిక్రమం—దేవుడికి మనమీాద ఎంతదయ వచ్చిందో విన్నావా?

కమల—వారు చెబుతూండగా, ఇంట్లోంచి విన్నాను.

పనసయ్య—కమల త్రివిక్రమం కూతురుగనక, మానీలగిరి ఆపిల్లని పెళ్లాడ్డం నాకిష్టమే!

త్రివిక్రమం—నాకూ ఇష్టమే.

కమల—నాకూను.

నీలగిరి—నే చెప్పిందీ ఆమాటే!

శానయ్య—నాకు పూర్వం నించీ ఇష్టమే. ఇంత కాలం ఇందుకోసమే మేం యత్నిస్తూంటే, ఇది తప్పన్నారు. గొప్పవారికి ఒప్పు అయితే, తప్పులన్నీ ఒప్పులే.

హంసరాజు—మరి వివాహయత్నాలు చెయ్యండి. మా హేమలతని చంద్రుడికిస్తున్నాను. ఆపెళ్లీ ఈవేళే!

శానయ్య—అందుకు అభ్యంతరమేమిటి, నన్ను ఏపిల్లా వరించదుగాని! ఏంజేస్తాం! కానీ! నేను ఈవిషయంలో ఎంతో ఆరిందా ఎత్తులు వేస్తోచ్చినా, ఈసంబంధంనాకు అనుమానంగానే ఉండేది, అసంభవం అనిపించేది. అయితేం? ఇంతకూ ఘటన!!!

సంపూర్ణము

